# విషయ సూచిక





# పురోగమనం

ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధుల మంత్రివర్గం 1952 మార్చి 6 వ తేదీన పరిపాలనా బాధ్యత స్వీకరించడంతో సంపూర్ణమైన ప్రజాప్రభుత్వం హైద్రాబాదు రాష్ట్రంలో ఏర్పడింది. అందువల్ల రాష్ట్రచరిత్రలో, రాజకీయ పరిణామంలో ఒక క్రొత్త అధ్యాయం ఆరంభమయినది. అన్ని రంగాలలోను అభివృద్ధి సాధనకు నూతనోత్సాహం కలిగినది.

ప్రజా ప్రతినిధులతో కూడిన ప్రభుత్వం ఏర్పడడంతో ప్రభుత్వం ఏమిటి, దాని ప్రణాళిక లేమిటి, అన్న విషయాన్ని తెలుసుకోవడానికి ప్రజలకు అవకాశం లభించింది. అంతేగాక అంతకు పూర్వం కంటే ప్రభుత్వాన్ని స్వేచ్ఛగా ధైర్యంగా విమర్శించడానికికూడా వారికి అవకాశం కలిగింది. అట్టి అవకాశం ఏర్పడడంచేతనే ప్రజలుకూడా అభివృద్ధి విషయంలో అనుకున్న లక్ష్యాలను సాధించడానికి మరింత ఉత్సాహంగా ప్రభుత్వంలో సహకరించారు. ముఖ్యంగా ఈ కారణంవల్లనే అనుకున్నదానికంటె ముందుగానే ఆహారకొరతను తీర్చడానికి వీలు కలిగింది. వివిధ రంగాలలో అధికోత్పత్తి సాధ్యమయింది. నిర్ణయింపబడిన ప్రాంతాలలో అభివృద్ధి పనులు ఫలప్రదంగా నిర్వహింపబడుతున్నవి. అన్నిచోట్ల జాతినిర్మాణ కార్యకలాపాలు సంతృప్తికరంగా కొనసాగుతున్నవి. నాయకులు ప్రబోధించిన మార్గాన్ని చూచి ఉత్తేజితులై, తమ కర్తవ్యాన్ని గ్రహించి మారుమూలలలో వున్న నిరక్షరాస్యులైన ప్రజలుకూడా పాఠశాల భవనములు, ఆసుపత్రులు, రోడ్లు మొదలయినవి నిర్మించడానికీ, పల్లెప్రాంతంలో ఒక క్రొత్త శోభను నవజీవనాన్ని రూపొందించడానికి ముందుకొస్తున్నారు. ప్రజాస్వామ్యం ఆచరింపబడడమంటే ఇదే.

హైద్రాబాదురాష్ట్రంలో ఈ విధంగా విజయవంతంగా సాగిపోతున్న కృషిని స్వయంగాచూచిన ప్రముఖ లనేకులు తమ

ప్రాంతాలు చెందినవి. ఇక్కడ సామాజికాభివృద్ధి కేంద్రాలలో జరిగిన పనిని చూచి భారతప్రభుత్వ కమ్యూనిటీ ప్రాజెక్టుల ఎడ్మినిస్ట్రేటర్ శ్రీ యస్. కే. డే తమ ప్రశంసలు తెల్పుతూ గుల్బర్గా కమ్యూనిటీ ప్రాజెక్టు ప్లానుకు పూడవలసిందిగా తాము ప్రధాన మంత్రికి సిఫారసు చేయగలమని అన్నారు.

ప్రజలుచూపే శ్రద్ధాసక్తులను గమనించి, వారు ఇస్తూవున్న సహకారాన్ని స్వీకరిస్తూ ప్రభుత్వంయొక్క ప్రతిశాఖ మరింత ఉత్సాహంతో కొత్తకార్యక్రమాలను అమలుజరుప ప్రయత్నిస్తున్నది. ఇవి సత్ఫలితాల నిస్తున్నవి. కొత్త కార్యక్రమాల వివరాలు ఇందులో ఉదాహరింపబడినవి.

అనేక పాతసమస్యలు సత్వరంగా పరిష్కరింపబడినవి. ఇతర రాష్ట్రాలలోని ప్రజలకంటె ముందుగా ఈ రాష్ట్ర ప్రజలకు కొన్ని సదుపాయములు కల్పించబడినవి. కొంత మేలు చేకూర్చబడింది. దీనితో ప్రజలు మరింత ఉత్సాహపడి గురుతరమైన బాధ్యతలను స్వీకరించడానికి ఆయత్తు లవుతున్నారు.

మన రాష్ట్రంలో ప్రవేశ పెట్టబడిన భూసంస్కరణలు ఇంతకుముందు ఏ రాష్ట్రంలోను అమలులోకి తేబడలేదు. జైళ్ళ పరిపాలనలోను, సాంఘిక సేవలోను ప్రవేశపెట్టబడిన సంస్కరణలు, తీసుకోబడిన చర్యలు శ్రేయోరాజ్య సిద్ధాంతాన్ని స్ఫురింప జేస్తాయి. పునరావాస సమస్య ఎన్నడో పరిష్కరింపబడింది. నేరముల సంఖ్య తగ్గిపోయింది. పోలీసుశాఖపై పెట్టబడే ఖర్చు సాధ్యమైనంతవరకు తగ్గించబడింది. వివిధ శాఖలలో ఇంతవరకు జరిగిన ఫలప్రదమైన నిర్మాణయుతమైన కృషి ఈ నాలుగేండ్లలో మనం ఎంత పురోగమించామో తెలియ జేస్తున్నది. ఈవిధంగా రెండవపంచవర్ష ప్రణాళికలో ప్రజలను అధికవిశ్వాసంతో ద్విగుణీకృతమైన ఉత్సాహంతో క్రొత్త బాధ్యతలను స్వీకరింపజేయుటకు అంతా సిద్ధం చేయబడింది.

మనరాష్ట్రంలో భూసంస్కరణల ప్రగతి అసమానమైనది. దాదాపు 6,20,000 మంది రక్షిత కౌలుదార్లకు వారి స్వాధీనంలో వున్న భూమిని సమంజసమైన ధరకు కొనుక్కోవడానికి హక్కు కల్పించబడింది. గరిష్ఠ కమతాలు నిర్ణయింపబడుతున్నవి. మిగులు భూములను భూములులేని వ్యక్తులకు

పంచబడుతున్నది. భూములు ముక్కచెక్కలై పోకుండా ఏకీకరించే చర్యలు గైకొన బడుతున్నవి. ఈ కృషినంతటినీ ప్రశంసిస్తూ జాతీయ ప్రణాళికాసంఘం ఈ విధంగా అభిప్రాయ మిచ్చింది: "ఒక్క హైద్రాబాదు రాష్ట్రం మినహా మరే ఇతరరాష్ట్రం లోను సేద్య ప్రమాణాలను క్రమబద్ధం చేయడానికీ, అన్ని ప్రమాణాలను భూకామం దులు అనుసరించి అమలు జరుపకపోయినట్లయితే వారి భూములను స్వాధీన పరచు కొని యాజమాన్యం వహించడానికీ కట్టుబాట్లుచేయడం జరుగలేదు."

స్థానిక పరిపాలనా రంగంలో సాధించ బడిన గొప్ప ఫలితాలలో హైద్రాబాదు సికింద్రాబాదు మునిసిపల్ కార్పొరేషనులను పూర్తిగా ప్రజాస్వామ్య సూత్రాల ప్రకారం వ్యవస్థీకరించడం ముఖ్యమైనది. ఈ కార్పొ రేషనులకు వయోజన వోటింగు హక్కుపై ఎన్నికలు జరిగినవి. కార్మికుల శ్రేయస్సు పట్లకూడా తగుశ్రద్ధ వహించబడింది. 'రెగే' కమిటీ సిఫారసుల ననుసరించి అనేక పరి శ్రమలలో పనిచేస్తున్న నిపుణులుకానికార్మికులకు కనీసవేతనాలు నిర్ణయించబడినవి. ఈ వేతనాలను ఫ్యాక్టరీలు కానట్టి తన సంస్థలకుకూడా ప్రభుత్వం వర్తింపజేసింది. విద్యారంగంలో ప్రాథమిక దశ మొదలుకొని ఉన్నత పాఠశాల దశవరకు విద్యార్థు లందరికీ హిందీ మరియు ప్రాంతీయభాషలు నిర్బంధ పఠనీయం చేయబడినవి. 500 లేక అంతకంటె ఎక్కువ జనాభాగల ప్రతి గ్రామానికీ ఒక పాఠశాల ఏర్పాటు చేయ బడింది. ఖాదీ మరియు చేనేత పరిశ్రమలకు సాధ్యమైనంతవరకు సహాయం చేయబడు తున్నది. ఈ వస్త్రమును మాత్రమే ప్రభుత్వశాఖలలో వినియోగించవలె నని ఆదేశించబడింది. ప్రజారోగ్యం వైద్యసౌకర్యాల విషయంలో ప్రథమ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలు ప్రణాళికా కాలానికి రెండేండ్లు ముందుగానే సాధింపబడినవి. వెనుక బడిన తరగతుల విద్యాభివృద్ధికీ, ఆర్థిక సముద్ధరణకు గట్టి చర్యలు గైకొనబడినవి. కొండజాతులవారికి ప్రత్యేక కాలనీలలో ఆవాసం కల్పించబడింది. అక్కడ వారికి ఇండ్లు, సేద్యం చేసుకోడానికి భూమి ఏర్పాటు చేయబడినవి. జైళ్ళలో ప్రవేశపెట్ట బడిన సంస్కరణలు, సాంఘికసేవకొరకు జరిగిన కృషి శ్రేయోరాజ్య సూత్రముల కనుగుణంగా వున్నవి. పునరావాస సమస్య ఎప్పుడో పరిష్కరింపబడింది. మత సామ రస్యం వర్ధిల్ల జేయబడింది. నేరములసంఖ్య చాలావరకు తగ్గింది. పోలీసు శాఖపై వ్యయం సాధ్యమైనంతవరకు తగ్గించబడింది. ప్రభుత్వశాఖలన్నింటిలో జరిగిన ఉత్పా దక, నిర్మాణాత్మకకృషి, ఈ పుస్తకం చివరన గల అనుబంధంలో వివరించబడి నట్లుగా, ఈ నాల్గేండ్లలో రాష్ట్ర పురోగమనాన్ని సూచిస్తున్నది.

★



నల్లగొండ రైతుల శిక్షణకేంద్రం.

ప్రకారం సేద్యం చేయబడింది. వ్యవసాయశాఖ 1,11,372 టన్నుల ఎరువు సరఫరా చేసింది.

రైతులు ఆధునికమయిన వ్యవసాయ పద్ధతులను అవలంబించేటట్లు చెయ్యాలంటే వారిలో ఎక్కువ ప్రోత్సాహం ఏర్పరచుకోవడం అవసరం. ఈ ఉద్దేశంతో వ్యవసాయశాఖ అనేక కొత్త ప్రక్రియలను అమలు జరిపింది. వీటిలో రైతుల శిక్షణ తరగతులు, రైతుదినోత్సవాలు, గ్రామాభివృద్ధి సంఘముల ఏర్పాట్లు మొదలైనవి కలవు. రైతులుకూడా ఉత్సాహంగా ముందుకొచ్చి వ్యవసాయంలో ఇవ్వబడిన శిక్షణేగాక వ్యవసాయమునకు సంబంధించిన పశువైద్యం, సహకారం, ప్రజారోగ్యం మున్నగు విషయాలలోకూడా తగురీతిగా శిక్షణపొంది లాభ పడినారు. ఆయిల్ ఇంజనులను నడుపుతూ, వాటి నిర్వహణకు సంబంధించిన విషయాలలో గ్రామస్థులకు శిక్షణ ఇవ్వడానికై అనేకచోట్ల తరగతులుకూడా నడుపబడినవి. వ్యవసాయశాఖయొక్క పరిశోధన క్షేత్రాలకు సంబంధించిన వివిధకేంద్రాలలో రైతులపిల్లలకు ఆరునెలలకోర్సుతో శిక్షణ తరగతులు నడుపబడినవి. పరిశోధన కేంద్రాలలో వాస్తవంగా జరుగుతున్న పనిని రైతులకు, ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధులకు చూపించి వారి ద్వారా ప్రయోజనకరమయిన సమాచారమును గ్రామస్థులందరికీ తెలియజేయడానికై తగుచర్యలు గైకొనబడినవి. అన్నిప్రాంతీయ భాషలలోను కరపత్రములు, గోడల కంటించే పత్రాలు, ప్రదర్శనములు, సినిమాలు ప్రచురణలద్వారా విస్తృతంగా ప్రచారం సలుపబడుతున్నది. పదేసి గ్రామాలకు ఒక గ్రామసేవకుని నియమించి అతడు రైతులకు కొత్తసేద్యపు పద్ధతులను తెలియజెప్పి, వారు వాటిని అనుసరించేటట్లు చేయడానికై ఒక పథకం అమలు పరచబడింది. ఈ పథకం చాలా విజయవంతంగా అమలు జరుపబడింది. ప్రతి గ్రామసేవకుడు ఒక గ్రామాభివృద్ధి సంఘమును ఏర్పాటుచేయగలిగినాడు. ఈ సంఘము గ్రామరోడ్లు, బావులు, పాఠశాలభవనములు, ఆసుపత్రులు మొదలగు నిర్మాణకార్యకలాపాలకు స్వచ్ఛందంగా పూనుకుంటుంది.

ట్రాక్టర్లతో బంజరుభూములను సాగుకు తేవడం, భూమికోసుకు పోవడాన్ని నిరోధించడం, నీటివనరుల అభివృద్ధి, మేలురకం విత్తనములపంపిణీ, మొక్కల సంరక్షణ మొదలగు కార్యక్రమాలద్వారా వ్యవసాయ శాఖ అధికోత్పత్తిని సాధించబూనుకుంది. మరాఠ్వాడా, కర్నాటక ప్రాంతాలలో ఈ శాఖకు చెందిన 51 ట్రాక్టర్లు పనిచేస్తున్నవి. గత సంవత్సరం 9,421 ఎకరాల పడావా భూమి సాగుకు తేబడినది. ఆ భూమివల్ల దాదాపు 1,136 టన్నుల ధాన్యం అదనంగా

వచ్చే రాగలదు. ఈ సంవత్సరం చివరి వరకు 20,000 ఎకరాలు కొత్తగా సాగుకు తేవచ్చు. ఈ భూమిలో సుమారుగా 4,200 టన్నుల ధాన్యం ఉత్పత్తి రాగలదు.

వ్యవసాయశాఖ రైతులకు తక్కావిస్తు నూతన ప్రాజెక్టు పనులు చేస్తుంది. ఈ ప్రాజెక్టు వల్ల 12,900 ఎకరాల భూమిని కొత్తగా సాగుకు తేవచ్చు. అందువల్ల అదనంగా 1,119 టన్నులధాన్యం ఉత్పత్తి అయినట్లు అంచనాలు తెలుపుతున్నవి.

పరుకట్టలు వేసే పథకాన్ని అమలు జరపడానికై భారత ప్రభుత్వంనుంచి రూ. 36.0 లక్షలు అప్పుగా లభించినవి. 1954-55లో వ్యవసాయశాఖ సిబ్బంది తాత్కాలికంగా పురమాయించి మరాట్వాడా కర్నాటక ప్రాంతాలలో 15,202 ఎకరాలలో కట్టలు వేయబడినవి. ఈ పనికి రూ. 1,59,415/-లు ఖర్చు అయినవి. ఈ డబ్బు తిరిగి రాబట్టుకోబడుతుంది. ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో రూ. 1,59,800/-లు ఖర్చు అయ్యే పరుకట్టల నిర్మాణపథకం మంజూరు చెయ్య బడింది. ఇంతవరకు 10,114 ఎకరాలలో కట్టలు వేయబడినవి.

పరిశోధనశాఖవల్ల చాలా సత్ఫలితాలు కలిగినవి. ఈ పని ఇంకా విస్తృత పరచబడుతున్నది. రాష్ట్రంలో నిర్ణీత కేంద్రాలలో 18 పరిశోధన కేంద్రాలు, ప్రయోగక్షేత్రాలు స్థాపించబడినవి. వీటిలో భూసారశాస్త్రం పైరుల అభివృద్ధి, మొక్కల సంరక్షణ మున్నగు విషయాలలో ప్రవీణులైనవారు పరిశోధనలు చేస్తున్నారు. అనేక మేలురకం వడ్లు, జొన్నలు, గోధుమలు, ఆముదాలు ఈ కేంద్రాలలో రూపొందింప బడినవి. హిమాయత్‌సాగర్, దిండి, వరంగలు, భాదే సూరు క్షేత్రాలలో మేలురకంవడ్లను పండింపడానికి ప్రయోగములు చేయబడుతున్నవి. నాందేడు, ముథోల్ కేంద్రాలలో ప్రత్తిపంట అభివృద్ధికై పరిశోధనలు సల్పబడుతున్నవి. 1422, 1492, 1946 అని వ్యవహరింపబడే ప్రత్తి రకాలు పంట దిగుబడివిషయంలో, రాదం, నారపొడవు, కాయపరిమాణం, చెట్టుయొక్క దార్ఢ్యత విషయంలో గావరాని 6 వ రకం కంటె శ్రేష్ఠమయినవని కనుగొనబడింది. లాతూరులోని మొక్కల పెంపకపు కేంద్రాలలో గావరాని 12 వ రకంకంటె 1422 వ మేలురకం ఎక్కువపంట దిగుబడి నిచ్చింది. పర్భనిలోని ప్రభుత్వ ప్రధాన వ్యవసాయ క్షేత్రంలో జరుపబడిన పెద్ద ప్రయోగాలలో ఇతర అన్ని రకాలకంటె 2204 వ రకం పంట దిగుబడివిషయంలో శ్రేష్ఠమయినదని తేలినది.

వ్యవసాయశాఖ సిబ్బంది మరియు ఉద్యోగులు 700 ప్లాట్లలో మేలురకం జాతులను గూర్చిన ప్రదర్శనములను చూపిస్తూ వుంటారు. దీనిఫలితంగా క్రమేణా పాతరకాలకు బదులుగా క్రొత్తరకాలు సేద్యంకొరకు ఉపయోగింపబడుతున్నవి. వీటివల్ల సాధారణ పరిస్థితులలోనే నూటికి 10 మొదలు 20 వంతులవరకు అదనపు ఉత్పత్తి లభిస్తున్నది. 1952-53 లో బద్నాపూరులో ప్రారంభింపబడిన గోధుమల పరిశోధన కేంద్రంలో మేలురకం గోధుమలను రూపొందించడానికి ప్రయోగములు జరుగుతున్నవి. రుద్రూరు, వరంగలు, రాజేంద్రనగరులోని ప్రయోగకేంద్రాలు విస్తృతం చేయబడినవి. కరీంనగర్‌లో మొక్కజొన్న పరిశోధన కేంద్రం నెలకొల్పబడింది. నూనెగింజల ప్రవీణుల విభాగం కూడా నెలకొల్పబడింది. పరిశోధన పథకములు మూడువిధములుగా ఉన్నవి. (1) ఖర్చును రాష్ట్రప్రభుత్వం భరించేవి. (2) ఖర్చును కేంద్రప్రభుత్వం మరియు కమ్యూడిటీ కమిటీలు భరించేవి. (3) ఖర్చును ఉభయులూ భరించేవి. మొదటివిధానానికి చెందినవి 11 పథకములు కలవు. వాటిలో 5 పథకములు మేలురకం ప్రత్తిని, జొన్నలను, పప్పు గింజలను సాధించడానికి ఉద్దేశింపబడినవి. నాలుగు పథకములు దేశీయ పనిముట్ల పరిశీలనకు, ప్రత్తిపంట అభివృద్ధికి, ఆముదముల పంటకు ఉద్దేశింపబడినవి. ఖర్చును ఉభయులూ భరించే పథకములు 17 కలవు. వీటిలో 5 పథకములు ప్రత్తి అభివృద్ధికి, మరి 5 పథకములు తెగుళ్ళను, రోగములను అరికట్టడానికీ, 7 పథకములు నూనె గింజలు, చెఱకు, మొక్కజొన్న, పండ్ల మొక్కల అభివృద్ధి పంపిణీలకు సంబంధించినవి.

వీటికి తోడుగా వివిధ శీతోష్ణ పరిస్థితులకు సరిపొయ్యేటటువంటి పచ్చిఎరువు పైరులను కనుగొనడానికై రూ. 44,545 లు ఖర్చుఅయ్యే పథకమొకటి రాజేంద్రనగర్‌లో అమలు జరుగుతున్నది. వృక్షసంబంధమైన మొక్కల పరిశీలనకొరకై 1955 జులై 1 వ తేదీనుంచి పంచవర్ష పథక మొకటి అమలు జరుగుతున్నది. వరిపైరు విషయమై మరొక పథకం కలదు. విత్తనాలువేసే తేదీల మార్పును నిర్ధారణ చేయడానికీ, వరిపైరుకు సంబంధించిన క్రిమి సంహారక మందుల నాణ్యమును, లాభనష్టములను కనుగొనడానికి 1955 నవంబరు 25 తేదీనుంచి మూడేండ్ల పథక మొకటి అమలు జరుగుతున్నది.

34 సామాజికాభివృద్ధి బ్లాకులలోను, వివిధజిల్లాలలోగల జాతీయ వికాసకేంద్రాలలోను అధికతరమైన ఉత్పత్తిని సాధించడానికై సేద్యం చేయబడుతున్నది.



యన్సర్ గుర్వావిలో వరదకట్టలు వేయడం.

జలాధారాలను నిర్మించుటలను హెచ్చించడానికై రైతులకు కొత్తబావులు త్రవ్వుకోటానికి, పాతబావులను మరమ్మతు చేయటానికి దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడుతున్నవి. ప్రస్తుతమున్న బావులనే లోతుచేసి ఎక్కువ నీటిని పొందడానికై వ్యవసాయశాఖ అనేక బోరింగు యంత్రములను కొన్నది. రైతులు ఆయిల్ ఇంజనులు, పర్షియన్ వీల్సు కొనుక్కోవడానికై తక్కావి ఋణాలు ఇవ్వబడుతున్నవి.

1950-51 నుంచి పంటలపోటీ పథకం ప్రారంభింపబడింది. ఈ పథకం మంచి ఫలితాల నిచ్చింది. ప్రతిసంవత్సరం దాదాపు 30 వేల రైతులు ఈ పథకాలలో పాల్గొంటున్నారు. వారు సాధించిన గరిష్ఠ పంటల వివరాలు ఇవి–వరి : 10872 పౌనులు ఎకరానికి; నదీమాతృక రబీజొన్న 7000 పౌనులు; దేవమాతృకజొన్న 5,600 పౌనులు: నదీమాతృక గోధుమ 2690 పౌనులు; నీటి వనరులేని గోధుమ 1920 పౌనులు; ఆలుగడ్డలు 32,000 పౌనులు; ప్రత్తి 1,600 పౌనులు; ఈ పోటీలలో గెలిచిన రైతులకు సువర్ణపతకములు, డీజెల్ ఇంజనులు బహూకరింపబడినవి.



## మార్కెటింగు

హైదరాబాదులోని రెగ్యులేటెడ్ మార్కెట్లు (క్రమబద్ధం చేయబడిన వ్యాపార సంతలు) పనిచేస్తున్న పైనాన్ని ఇతర రాష్ట్రాలలోని ప్రముఖులు మిక్కిలి ప్రశంసించారు. చాలామంది ప్రముఖులు వీటిని స్వయంగా చూచారు. రాష్ట్రంలో ఇటువంటివి 83 మార్కెట్లు ఉన్నవి. గత నాలు గేండ్లలో ఈ మార్కెట్లకు వస్తున్న సరుకుల పరిమాణం క్రమేణా పెరుగుతున్నది. 1953-54 సంవత్సరంకంటె 1954-55 సంవత్సరంలో అదనంగా 39 లక్షల పల్లాల సరుకు వచ్చింది. అంటే సరుకు రాబడి నూటికి 50 వంతులు హెచ్చిందన్నమాట. ఇందుకు కారణాలు ఇవి : కాలమానపరిస్థితి బాగా వుండటంచేత అధికోత్పత్తి జరుగడం, అధికాహారోత్పత్తి ఉద్యమం ; రెగ్యులేటెడ్ మార్కెట్లలో సరుకుల స్వేచ్ఛా రవాణాకు కలుగజేయబడిన అధిక సౌకర్యాలు. ఇందుచేతనే మార్కెట్టు కమిటీల ఆర్థిక పరిస్థితి సంతృప్తికరంగా వున్నది. చాలా మార్కెట్లకు డబ్బు మిగలడంకూడా జరిగింది. ఆ డబ్బును వారు నిర్మాణయుతమైన అభివృద్ధిపనులకు పెట్టుబడి పెట్టారు. అటువంటి పనులన్నిటియొక్క కార్యక్రమమొకటి విపరంగా తయారు చేయబడింది. పనులను త్వరగా జరుపడానికై ఇంజనీరింగు విభాగం నెలకొల్పబడింది.

భారతప్రభుత్వం నియమించిన వ్యవసాయోత్పత్తుల ధరల విచారణసంఘం ఇక్కడి కొన్ని మార్కెట్లను సందర్శించింది. ఆ సంఘపు నివేదికలో ఇక్కడి మార్కెట్లు పనిచేస్తున్నపైనం, మార్కెటింగుశాఖ సేక రిస్తున్న ధోగట్టా ప్రశంసాపాత్రమైనవని పేర్కొనబడింది. ఇటీవల జరిగిన అఖిల భారతమార్కెటింగు సహకార మహాసభ వారిచే చేయబడిన సిఫారసులన్నీ హైదరాబాదురాష్ట్రంలో మార్కెటింగు వ్యవస్థ విజయవంతంగా పనిచేస్తున్న విధానమునుంచి గ్రహింపబడినవే.



నార్సింగిలో మార్కెట్ కమిటీ ప్రారంభోత్సవం.

రెండవ పంచవర్షప్రణాళికలో ఇంకా 21 రెగ్యులేటెడ్ మార్కెట్లను స్థాపించాలని తలపెట్టబడింది. ఇవేగాక పశువులు, కూరగాయలు, పండ్లమార్కెట్లను క్రమబద్ధం చేయవలసి వున్నది.

ఈ రాష్ట్రంలో కొన్ని సరుకులకు గ్రేడింగు స్టేషనులను నడపడం అవసరమని భావించబడింది. తదనుగుణంగా నెయ్యి, ఆహారమున ఉపయోగించబడే నూనెలు, ఆముదం నూనె, బియ్యం, బత్తాయి కమలాలు మున్నగువాటిని ప్రమాణీకరించడానికి మార్కెటింగుశాఖ తలపెట్టింది. ఇందుకు రూ. 6,12,008 లు ఖర్చుకాగలవు.

మార్కెటు వార్తాసంస్థను అభివృద్ధి పరచడానికై బొంబాయిలోని ప్రాంతీయ కేంద్రంయొక్క సమన్వయంతో ఈ రాష్ట్రంలో మూడు ఫీల్డు ఆఫీసులను నెలకొల్పడానికి రెండవపంచవర్ష ప్రణాళికలో భారతప్రభుత్వం తలపెట్టింది.



# పశు వైద్యం

పశుసంపద అంటువ్యాధులకు గురి కాకుండా రక్షింపడం, శాస్త్రీయపోషణ పద్ధతులద్వారా పశుసంపదను అభివృద్ధి పరచుటకు పథకం వేయడం, పశువైద్యశాఖ ప్రథమ కర్తవ్యములలో చేరియున్నవి. ఈ విధానాల కనుగుణంగా ఒకవైపు ఈశాఖ కార్యకలాపాలు ఏటేటా ఎక్కువవుతుండగా, రెండోవైపు ద్వితీయ పంచవర్షప్రణాళిక క్రింద మహత్తరమైన కార్యక్రమం తయారు చేయబడింది.

ఈశాఖలో 34 శాశ్వతవైద్యశాలలు 182 సంచారక పశువైద్య దళములు పనిచేస్తున్నవి. ఇవి లక్షలాది పశువులకు చికిత్స చేస్తున్నవి. గతసంవత్సరం అంటువ్యాధులు కాని 6 లక్షల కేసులు, అంటువ్యాధులకు చెందిన 28558 కేసులు చికిత్సపొందినవి. అంతేగాకుండా అంటువ్యాధులు సోకకుండా చేయుటకై 15,63,360 పశువులు రక్షింపబడినవి. పశువ్యాధులు ప్రబలిన జిల్లాలో అవసరమైనపుడు తక్షణసహాయం చేయుటకై ఒక సంచారకవైద్యశాలకూడ పనిచేస్తున్నది.

సెరం ఇన్స్టిట్యూట్ అనేక రకములైన సూదిమందులను తయారు చేస్తున్నది. ఈ మందులు స్థానికావసరములకు పోను, బొంబాయి, ఫిలిప్పైన్సులకుకూడా ఎగుమతి చేయబడుతున్నవి.

పశువైద్యశాఖ రాయచూరు జిల్లాలో రిండర్‌పెస్ట్ నిర్మూలనా పథకంక్రింద పూర్తిచేసిన పైలట్ ప్రాజెక్టు పనిని చూచి భారత ప్రభుత్వ సెంట్రల్ రిండర్‌పెస్ట్ కంట్రోల్ కమిటీవారు ప్రశంసించారు. ఈరక్షణ కార్యక్రమం నల్గొండ, మహబూబునగరం జిల్లాలకుకూడా వర్తింపబడింది. వచ్చే రెండుసంవత్సరాలలో రాష్ట్రమంతటా రిండర్‌పెస్ట్ వ్యాధి నిర్మూలం కాగలదని ఆశింపబడుతున్నది.

పరిగణింపబడిన పశుజాతులను. గొఱ్ఱెలను ఆయా ప్రాంతాలలో అభివృద్ధిపరచుటకు ఒక నిర్దిష్టమైన విధానం విజయవంతంగా అమలుపరచబడుతున్నది. హైద్రాబాదు, కరీంనగర్, ఉద్గీర్, హింగోలి, మునీరాబాదులలో ఉన్న 5 పశుపోషణశాలలు, ఔరంగాబాదులో ఉన్న బఱ్ఱెల పోషణశాల, మహబూబునగరులోని గొఱ్ఱెల పోషణశాలలద్వారా ఈ కృషి చేయబడుతున్నది. రాష్ట్రంలో ఏడు కృత్రిమ గర్భధారణ కేంద్రములు పనిచేయుచున్నవి. కరీంనగరు, ఉద్గీరు, ఔరంగాబాదు, హింగోలిలలోని 1 ప్రధాన గ్రామకేంద్రములు ప్రగతి చెందుతున్నవి. ఒక సాల్వేజ్ ఫారం స్థాపించబడింది. ఇక్కడ ఎండిపోయిన పశువులు పోషించబడుతాయి. అందుకు ఖర్చు చాలా తక్కువగా ఉంటుంది. పశువుల యజమానులకు ముఖ్యంగా తక్కువ ఆదాయంగలవారిని- ప్రోత్సహించడమే సాల్వేజ్ ఫారం ఆశయం. హైద్రాబాదు పశుసంపద అభివృద్ధిచట్టం, అంటువ్యాధులచట్టం అను పేరుతోగల క్రొత్త శాసనములను ప్రభుత్వం తీవ్రంగా పరిశీలిస్తున్నది.

సీతారాంపేటలోని కేంద్రకోళ్ళపెంపకపు శాల విస్తృతపరచబడింది. ఇక్కడ పక్షులసంఖ్య 200 నుండి 1200 ల వరకు పెంచబడింది. ఇదేగాక జిల్లాలలో 7 నమూనాకోళ్ళ పెంపకపుశాలలు ఉన్నాయి. ఈ కేంద్రములు కోళ్లను పెంచువిధానమును తెలియజేయడమేగాక గ్రుడ్లు, కోడిపిల్లలు, అభివృద్ధిచెందిన పక్షులను పంచిపెడుతుంది.

ఈశాఖ పరిశోధన, ప్రచారకార్యక్రమాలను విశేషంగా నిర్వహిస్తున్నది. మేలాలు, జాతరలలో పశుప్రదర్శనములు ఏర్పాటు చేయబడుతున్నాయి. శ్రేష్ఠమయిన పశువుల యజమానులకు బహుమతులు ఇవ్వబడుతున్నాయి. ఇంతవరకు బహుమతుల క్రింద 853 తులాల వెండికడియాలు, రూ. 834 నగదు ఇవ్వబడినవి.

ఈశాఖయొక్క విద్య, శిక్షణకార్యక్రమం క్రింద సిటీవెటరినరీ అసిస్టెంట్లకు ఒకరిఫ్రెషర్ కోర్సు ప్రారంభింపబడింది. ఇంతవరకు 30 మంది అభ్యర్థులకు పశువైద్యంలో ఆధునిక అభివృద్ధిపద్ధతుల విషయంలో శిక్షణ యివ్వబడింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింది పథకములను అమలుపరచుటకు పలసిన పశువైద్య సిబ్బందిని సమకూర్చుటకు, భారతప్రభుత్వం అధ్వర్యాన పశువుల పెంపకం, పశువైద్యం విషయాలలో రెండేళ్ల డిప్లొమా కోర్సు తెరువబడింది,

వివిధ కీలకగ్రామకేంద్రములు, జాతీయ వికాసకేంద్రములలో జరుగు పనిని సక్రమంగా నిర్వహించుటకును, తగు పరిశీలన చేయుటకును ప్రత్యేకంగా ఒక డెవలప్మెంటు ఆఫీసరు పదవి మంజూరు చేయబడింది. సామాజిక ప్రాజెక్టు జాతీయవికాస కేంద్రముల ప్రాంతాలలో పశువైద్యం, పశుపోషణ కార్యక్రమాలు బాగా ప్రచారంలోకి వచ్చినాయి. మిర్జాపూరు, బాన్సువాడ, ఖీడులలో కృత్రిమ గర్భధారణకేంద్రాలు, కోళ్ళ పెంపకకేంద్రాలతోపాటు పశువైద్య ఆసుపత్రులు తెరవబడినాయి. రాష్ట్రంలో సామాజిక ప్రాజెక్టు జాతీయవికాస కేంద్రములన్నిటిలో ఇప్పటికిని నెలకొల్పబడి పనిచేయుచున్నవి. ప్రధాన కేంద్రాలలో తేనెటీగల యూనిట్, గొర్రెలయూనిట్ కూడా స్థాపింపబడుతాయి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఉప్పల్‌లో పెగడ ఉత్పత్తికేంద్రం స్థాపించుటకు ఒక పథకం తయారుచేయబడింది. ఈ ప్రణాళికా కాలంలో నగర పాల సరఫరా పథకం కూడా అమలుపరచబడుతుంది.



# అడవులు

రాష్ట్రంలో అడవుల పోషణవిధానం, భూసారపరిరక్షణ పథకం అమలుపరచబడుతున్న ఫలితంగా గత ఐదు సంవత్సరాల నుంచి అటవీప్రాంతం తీవ్రగతిని విస్తృతమవుతున్నది. అటవీశాఖ ఆదాయంకూడా ఎక్కువవుతున్నది. 1953-54 సం.లో అడవులశాఖకు రూ. 8095059/- ల ఆదాయం రాగా 1954-55 సం.లో రూ. 9251007/- ల ఆదాయం వచ్చింది. రక్షిత అడవుల విస్తీర్ణం 1384246 నుండి 1404511 ఎకరాలవరకు అంటే 20265 ఎకరాలు ఎక్కువ చేయబడింది.

గత ఆర్థికసంవత్సరంలో రూ. 28,038/- ల ఖర్చుతో 342641 ఎకరాల ప్రాంతం అగ్నికి గురికాకుండా రక్షింపబడింది. అంతకు ముందు సంవత్సరంలో రూ. 14679/- ల ఖర్చుతో 214368 ఎకరాల ప్రాంతం అగ్ని వాతపడకుండా కాపాడబడింది. సేద్యంకొరకు అడవులనుంచి కొన్నిప్రాంతాలను వేరు చేసి ఉపయోగించడం, భూమిని ఉపయోగించుకొను విధానం, అడవులలో రాకపోకలకు ఏర్పాటుచేయడం, సేద్యానికి యోగ్యమైన కొన్ని అటవీప్రాంతాలలో యంత్రముల సహాయమున సేద్యంచేయుట - ఈ చర్యలవల్ల అడవులలోను వ్యవసాయాభివృద్ధిలోను సత్ఫలితాలు కలిగినాయి. కమ్యూనిస్టు ప్రమాదాలకు గురియైన అటవీప్రాంతాలను వశ పరచుకొని, వాటిలో తిరిగి పని ప్రారంభింపజేయడంవల్ల ప్రభుత్వానికి అదనంగా ఆదాయం రావడమేగాక, ఆ ప్రాంతాలలో నిరుద్యోగ పరిస్థితిని తొలగించుటకుకూడా ఆస్కారం కలిగింది.

పంచవర్ష ప్రణాళిక క్రింద, జాతీయ అటవీ విధానాని కనుగుణంగా అడవుల పెంపకం, అడవుల సర్వే, అడవుల విభజన మున్నగు పనులు నిర్వహించుటకు అనేక పథకములకు మంజూరీ ఇవ్వబడింది. హైద్రాబాదు నగరానికి సమీపాన సాహెబ్‌నగర్‌లో భూసారపరిరక్షణ పరిశోధనా కేంద్రం నెలకొల్పబడింది. ఇక్కడ ఒక సిల్వికల్చరిస్టు నిర్వహణక్రింద పని జరుగుతుంది. ఆయన కేంద్ర భూసార పరిరక్షణ సంఘం అధ్వర్యాన పరిశోధనలు చేస్తున్నారు.

# సహకారం

ప్రస్తుతం రాష్ట్రంలో మొత్తం 14,638 సహకారసంఘాలు ఉన్నవి. వీటిలో 12,09,144 మందికి సభ్యత్వం కలదు. ఈ సంఘాలన్నింటికి చెల్లింపబడిన మూలధనం రూ. 2,90,90,511 లు; చెలామణి అయ్యే మూలధనం రూ. 13,99,03,495 లు; గతమూడు సంవత్సరాలలో అదనంగా 1,863 సహకారసంఘాలు స్థాపించబడినవి. ఇవి 40 రకాలుగా ఉన్నవి. అవి పరపతి, మార్కెటింగ్, ఉత్పత్తి, వినిమయ, ఇన్సూరెన్సు, గృహనిర్మాణ, బ్యాంకింగ్, మరియు కార్మిక మున్నగు సంఘాలుగా ఉన్నవి.

ప్రధాన సంస్థక్రింద, హైదరాబాదురాష్ట్ర సహకార బ్యాంకు, దాదాపు 6,000 వ్యవసాయక పరపతి సంఘాలు, 7,000 ధాన్యపు బ్యాంకులు పనిచేస్తున్నవి. వ్యక్తిగత సభ్యత్వాలను తొలగించడంద్వారా బ్యాంకు పునర్నిర్మించబడింది. దీని చెలామణి అయ్యే మూలధనం రూ. 12 లక్షలు. రిజర్వునిధి రూ. 12 లక్షలు. రాష్ట్రప్రభుత్వం రూ. 5 లక్షలను పెట్టుబడిధనంగా చెల్లించింది. ఇంతేగాకుండా 1953–54 వ సం. లో తాత్కాలిక వ్యవసాయ అవసరాలకొరకు రూ. 25 లక్షల మేరకు, 1954–55 వ సం. లో రూ. 5 లక్షల మేరకు, 1955–56 వ సం, లో కోటి రూపాయల మేరకు ఇండియా రిజర్వుబ్యాంకునుండి స్వల్పకాలిక ఋణసౌకర్యం కల్పించుటకు రాష్ట్రప్రభుత్వం పూచీపడింది. పై మొత్తాలు, కేంద్రబ్యాంకులు, ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాలు, గ్రామీణ బ్యాంకులద్వారా వ్యవసాయదార్లకు ఇవ్వబడినవి. 1953–54 వ సంవత్సరంలో లభించిన రూ. 25 లక్షల ఋణం సహకార కేంద్రబ్యాంకుచే తిరిగి చెల్లింపబడింది. ప్రస్తుత సంవత్సరానికి కోటిరూపాయలు నిర్ణయింపబడినవి.

రిజర్వుబ్యాంకు అధికార్ల సిఫార్సు ననుసరించి, ఆర్థికేతరమైన బ్యాంకులతోపాటు సహకార కేంద్ర బ్యాంకులసంఖ్య 17 వరకు తగ్గించబడంద్వారా ఈ బ్యాంకుల స్వరూపం పునర్వ్యవస్థీకరించబడింది. దీనివలన జిల్లాకొక పటిష్టమైన కేంద్రబ్యాంకు ఏర్పడగలదు.

బహుళార్థసాధక ప్రయోజనాలకు ఉపయోగపడడానికి గాను పెద్దమొత్తాలను ఇచ్చే పరపతి సంఘాలను, గ్రామీణ బ్యాంకులను నిర్వహించడానికై ద్వితీయ పంచవర్షప్రణాళికలో ఒక విస్తృతమైన కార్యక్రమం రూపొందించబడింది. ఇవి 5 నుంచి 10 గ్రామాలుగల ప్రదేశంలో 250 మంది సభ్యులుంటే పనిచేయగలవు. మహబూబ్‌నగర్, నిజామాబాదు జిల్లాలలోని పైలట్ ప్రాజెక్టు ప్రాంతాలలో ఈపని ప్రథమంగా ప్రవేశపెట్టబడింది. మహబూబ్‌నగర్ జిల్లాలో 5 మరియు నిజామాబాదు జిల్లాలో 3 సంఘాలచొప్పున ఉన్నవి.

కేంద్ర భూమితనఖా బ్యాంకు తనక్రింద వున్న 20 ప్రాథమిక భూమితనఖా సహకారసంఘాలద్వారా రైతులకు దీర్ఘకాలిక అప్పులను ఇస్తున్నది. కేంద్ర బ్యాంకు రూ. 5 లక్షలను అప్పుగా ఇచ్చింది. ఇటీవలనే భారతప్రభుత్వం రూ. 10 లక్షల ప్రత్యేక దీర్ఘకాలిక ఋణాన్ని మంజూరుచేసింది. ఈ డబ్బు కౌలుదారీ వ్యవసాయ భూముల చట్టంప్రకారం రక్షిత కౌల్దారులు భూములు కొనుక్కోడానికై ఆర్థికసహాయం చేసే నిమిత్తం కేటాయించబడింది.

ప్రత్యేక శిక్షణపొందిన నలుగురు ఇనస్పెక్టర్లు రాయచూర్, బాదేపల్లి, నాందేడ్, లాతూర్ కేంద్రాలలో సహకార మార్కెటింగ్‌ను నిర్వహించడానికిగాను నియమింపబడినారు. రాయచూర్ జిల్లాలో ప్రత్తికొరకు కంట్రోలు ఋణాన్ని ఇచ్చే పథకం ఒకటి ఇటీవలనే ప్రవేశపెట్టబడింది. లక్షరూపాయల మేరకు ఋణాలు ఇవ్వబడినవి. ద్వితీయ పంచవర్షప్రణాళికా కాలంలో దాదాపు 50 క్రమబద్ధమైన మార్కెట్లకు సహకారమార్కెటింగ్ వుండగలదని భావింపబడుచున్నది.

గ్రామీణ పరపతి విచారణ నివేదిక యొక్క సలహాల ప్రకారం రూ. 10 లక్షలు ఖర్చు కాగల గిడ్డంగుల నిర్మాణ పథకం తయారుచేయబడింది. ఇది ప్రభుత్వ పరిశీలనక్రింద ఉన్నది.

# మత్స్యశాఖ

1955 ఏప్రిలులో మత్స్యశాఖ పునర్వ్యవస్థీకరించ బడింది. ఫలితంగా ఆదిలాబాదు, వరంగలు, ఖమ్మంజిల్లాలు ఈశాఖ క్రిందికి వచ్చినవి. నాందేడులోని ప్రాన్‌ఫిషరీ స్టేషనును పిస్సీ కల్చరల్ యూనిటుగా మార్చడమైనది. దిండి, మానేరుల అభివృద్ధిపథకములు మత్స్యశాఖ పథకములతో విలీనం చేయబడినవి.

1955 అక్టోబరులో బెండుసుర ప్రాజెక్టు క్రింద చేపలను పెంచేపథకం మంజూరు చేయబడింది. అప్పటినుంచీ మరాట్వాడాలో రెండు చేపల పెంపకపు యూనిట్లు వున్నవి. కర్నాటక ప్రాంతంలో తుంగభద్ర ప్రాజెక్టు క్రింద ఒక కేంద్రం పెట్టటానికి మంజూరీ లభించింది.

హైద్రాబాదురాష్ట్రంలో చేపలవిషయమై పరిశీలనలు జరుపడానికై భారతీయ వ్యవసాయ పరిశోధనాసంఘంవారు ఒక ఏడాది కొరకు ఒక పథకాన్ని మంజూరుచేశారు. ఈ పరిశీలనకొరకై హైద్రాబాదు, మెదక్ జిల్లాలలో ఎన్నిక చేయబడినవి. ఈపని గత అక్టోబరు నెలనుంచి జరుగుతున్నది.

రెండవ పంచవర్షప్రణాళికలో చేపల ఉత్పత్తిని దాదాపు నూటికి 40 వంతులు హెచ్చించడానికి పథకములు వేయబడినవి.



# భూవ్యాదాయం

ఈ శాఖ యొక్క విధులు ఇవి: ప్రస్తుత నియమావళి ప్రకారం భూములను సక్రమంగా పేదవారలకు కేటాయించడం ద్వారా ఎక్కువ భూమిని సాగుక్రిందికి తేవడం; పైర్లకనిధులు; శిస్తుల ఋణాలు: పెద్ద ప్రాజెక్టుల క్రింది భూముల అభివృద్ధి; స్వల్పనీటి వనరుల నిర్వహణం; ప్రకృతి విపత్సాలవల్ల నష్టపడ్డ రైతులకు సహాయం ప్రతి సంవత్సరం ప్రత్యేకతాహసి నియమావళి ననుసరించి హరిజనులకూ, వెనుకబడిన తరగతులకూ, భూములులేని వ్యక్తులకు భూములు మంజూరు చేయబడుతున్నాయి. ఈ విధంగా 1955—56 సంవత్సరంలో 2,29,394 ఎకరాలు మంజూరు చేయబడినవి. జిల్లాల్లో ఇరుకువాడల్లో నివసిస్తున్న



*ఒక హరిజనునికి భూమి మంజూరు చేస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి.*

హరిజనులకు కాలనీలు ఏర్పాటు చేయడానికై 2,710 యెకరాల భూమి స్వాధీనపర చుకోబడింది. ఈ భూమిపంపకం కూడా జరిగింది. ఈ శాఖ, వ్యవసాయశాఖ ప్రతిసంవత్సరం రైతులకు తక్కావీ అప్పులు ఇవ్వబడుతున్నవి.

జిల్లా కలెక్టర్లతో సంప్రదించిన తర్వాత స్థానికపరిస్థితులనుబట్టి వివిధ సహాయక చర్యలు గైకొనబడుతున్నవి. గత సంవత్సరం దీర్ఘకాలిక స్వల్పకాలిక పద్ధతులప్రకారం రూ. 6,66,000 లు తక్కావీక్రింద ఇవ్వబడి నవి. ఇది సాధారణ తక్కావీ. దీనికి తోడుగా రూ. 3.25 లక్షలు అధిక వర్షాలవల్ల నష్ట పడిన జిల్లాలలో పంపిణీకొరకై అదనంగా తక్కావీ మంజూరు చేయబడినది. నష్టపడ్డ ప్రాంతాలలో భూమిశిస్తులు తక్కావీ అప్పులు వసూలుచేయడంలో తొందరపడనక్కర లేదని కలెక్టర్లకు సూచించనైనది. కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయ వికాసకేంద్రాలు మున్నగువాటిలో ప్రజలు ఇవ్వవలసిన వాటా సడలించబడింది. ఇందుకొరకై రూ. 50,000 లు మంజూరు చేయబడినవి. భూమి శిస్తుల వసూలు ఈ క్రిందివిధంగా తాత్కాలికంగా ఆపబడింది.

| | | |
|---|---|---|
| బీదర్ ఖరీఫ్ కిస్తు | రూ. | 21,33,448-14-2 లు |
| పర్భనీ : | రూ. | 61,448-14-8 లు |
| గుల్బర్గా : | రూ. | 4,60,513- 0-0 లు |
| మెదక్ : | రూ. | 2,70,000- 0-0 లు |
| ఉస్మానాబాద్ : | రూ. | 41,931-4-9 లు |

కట్టలువేసేపనులు, గుడిసెలకు కలప సామాగ్రి సరఫరా మొదలగు పనులు జరిగినవి.

*భూసంస్కరణలు*

ప్రజాస్వామ్య వ్యవస్థవల్ల హైదరాబాదు రాష్ట్రంలో కలిగిన మార్పులలో హైదరాబాదు కౌల్దారీ, వ్యవసాయభూముల చట్టం ఆమోదించబడటం ఒకటి. ఈ చట్టం సేద్యదారులకు భూమిపై యాజమాన్యపు హక్కును సంక్రమింప జేస్తున్నది. రాష్ట్రంలో 6,20,000 మంది రక్షిత కౌలుదారు లున్నారు. వీరిలో 13,000 మంది మాత్రమే తమకైతాము 1,41,000 ఎకరాలభూమి

కొనుక్కున్నారు. కనుక కౌలుదార్లకే యాజమాన్యహక్కును సంక్రమింపజేసే కార్యక్రమాన్ని త్వరితగతిని నడుపడానికై కొన్ని నిర్ణీత ప్రాంతాలలో చట్టంలోని 38-ఇ సెక్షనును అమలు పరచడానికి ప్రభుత్వం నిర్ణయించింది. దీనివల్ల ఒక నిర్ణీత తేదీ నుంచి రక్షిత కౌలుదార్లు తాము సేద్యం చేస్తున్న భూములను భూకామందులనుంచి కొనుక్కొనే హక్కు దానంతటదే వారికి సంక్రమిస్తుంది. ఈ సెక్షను ఖమ్మం, ఔరంగాబాదు జిల్లాల్లోను, వరంగల్ జిల్లాలోని ములుగు తాలూకాలోను, గుల్బర్గాజిల్లాలోని యాదగిరి డివిజనులోను అమలులోకి తేబడింది.

చట్టం నిర్ణయింపబడిన గరిష్ఠ పరిమితులుకూడా అమలుపరచబడుచున్నవి. 1954 సంవత్సరపు మిగులు భూములు ప్రకటన నియమావళివల్లను, భూముల లెక్కలవల్లను 75,00,000 ఎకరాల మిగులుభూమి భూకామందులకు కలదని తెలియవచ్చినది. ఇందులోనుంచి 40 లక్షల ఎకరాలపై యాజమాన్యం కౌలుదార్లకు మార్పుచేయబడుతుంది. 25 లక్షల ఎకరాలు మిగులు భూములుగల భూకామందులు సొంతసేద్యం కొరకు ఉంచుకోడానికి అనుమతించబడుతుంది. మిగిలిన 100 లక్షల ఎకరాలను ప్రభుత్వమే స్వాధీనపరచుకొని భూములు లేని వ్యక్తులకు పంపిణీ చేస్తుంది. యాజమాన్యహక్కుల మార్పిడికి సంబంధించిన నియమావళి, మేనేజిమెంటును వహించడంద్వారా గరిష్ఠ పరిమితులను నిర్ధారణచేయడం, లేక చట్టంలోని 53-సి, 53-డి సెక్షనులక్రింద మిగులు భూములను స్వాధీన పరచుకోవడం మున్నగు వాటికి సంబంధించిన నియమావళి తయారు చేయబడింది. ఈపని ఖమ్మం, ఔరంగాబాదు జిల్లాలలోను, ములుగు తాలూకాలోను, యాదగిరి డివిజనులోను ఇప్పుడు జరుగుతున్నది. వచ్చే మూడేండ్లలో ఇతర జిల్లాలకుకూడా వర్తింపజేయబడుతుంది.

ప్లానింగు కమిషన్‌వారు సూచించిన విధంగా భూములలెక్కలు తయారుచేసే పని హైద్రాబాదు రాష్ట్రంలో పూర్తియైనవి. భారతదేశంలో హైదరాబాదు రాష్ట్రమే ఈపనిని మొదట జరిపింది. మన దేశంలో జరిగిన విచారణల అన్నిటికంటె ఇది చాలా పెద్దది. దీనికి సంబంధించిన నివేదిక తయారవుతున్నది. భూములు లెక్కలపనిలో ఒక భాగంగా రాష్ట్రమంతటా హక్కుల రికార్డుకూడా తయారు చేయబడుతున్నది. ఇప్పుడు రూపొందించబడిన ఖాస్రాపహాణి పద్ధతివల్ల మూడు ప్రయోజనములున్నవి. 1. భూముల లెక్కలు తయారుకావడం. 2. హక్కుల రికార్డులు తయారు కావడం, 3. సాలుసరి భూమిశిస్తుల లెక్కలు తయారు

కావడం. దీనిఫలితంగా భూమిపై స్వాధీనంగల వ్యక్తులందరిపేర్లు రిజిష్టరు చేయబడుతున్నవి భూమిశిస్తుల లెక్కల విషయంలో వీరు శిస్తుచెల్లించేవారుగా పరిగణింపబడుతున్నారు. ఈ విధానంవల్ల అనేక సందర్భాలలో కేవలం మధ్యవర్తులుగానే ఉంటున్నట్టి నామకార్థ పట్టేదార్లు తొలగిపోతారు. ఈ సంస్కరణవల్ల 12 లక్షలమంది లాభపడుతారు.

భూమిశిస్తు చట్టాన్ని సవరించడంద్వారా ఇజారా గ్రామాలలో పన్నెండేండ్లు భూమిపై స్వాధీనంగల కౌలుదారులందరు షిక్మీదార్లుగా ప్రకటింపబడినారు. షిక్మీదారు తాను సేద్యంచేస్తున్న భూమియొక్క కౌలుసొమ్ముకుగల తేడా సొమ్ముకు పదిరెట్లకు మించకుండా ధరను చెల్లించి భూమినికొనివేయవచ్చు. మొత్తం 390 ఇజారా గ్రామాలలో షిక్మీదారీ రికార్డులు పూర్తిచేయబడినవి. 23,194 మంది వ్యక్తులకు షిక్మీదారీ సర్టిఫికెట్లు పంచిపెట్టబడినవి.

భూదానోద్యమంలో దానంగా ఇవ్వబడిన భూములను క్రమబద్ధం చేయడానికై ప్రభుత్వం ప్రత్యేక నియమావళిని తయారుచేసింది. ఈ నియమావళి 1957 ఆగస్టువరకు అమలులో ఉంటుంది.

కౌలుదారీ చట్టం నిబంధనల ననుసరించి 100 గ్రామాలలో భూముల ఏకీకరణపని ప్రారంభించబడింది. క్రమేణా ఇతర ప్రాంతాలలో కూడా ఈ పని జరుగుతుంది. ఇందుకొరకై ప్రత్యేకంగా ఒక బిల్లు కూడా త్వరలో తేబడుతుంది.

భూసంస్కరణల వ్యవహారంలో ప్రజాప్రతినిధుల సహకారం కూడా తీసుకోవడానికై హైదరాబాదు ల్యాండు కమీషన్ ఏర్పాటు చేయబడింది. ఈ కమీషన్‌లో ముగ్గురు ఎన్నుకోబడిన సభ్యులు, ముగ్గురు నామినేటు చేయబడిన సభ్యులు, ఒకరు అధికారసభ్యుడు కలరు. స్థానిక ప్రాంతాల విభజన, కుటుంబ కమతాల నిర్ణయం, భూములు ముక్కచెక్కలు కాకుండా ఏకీకరించడం మున్నగు విషయాలపై ఈ కమీషనువారు చేసిన సిఫార్సులను ప్రభుత్వం ఆమోదించింది సమర్థవంతంగా సేద్యం జరుగడానికై ప్రమాణాలను నిర్ణయించడం, సహకార వ్యవసాయ మొదలగు విషయాలను గూర్చి ఈ కమీషనువారు ఇంకను ప్రభుత్వానికి నివేదికను అందజేయవలసి యున్నది. త్వరలోనే ఈ నివేదిక అందగలదు.

## అబ్కారీ

రాష్ట్రప్రభుత్వానికి అబ్కారీవల్ల విశేష ఆదాయంవస్తుంది. అయితే ఇటీవల కొద్ది సంవత్సరములు డబ్బు మార్కెట్టు కట్కాట్టిగా ఉంటున్నందువల్ల, ప్రభుత్వం ఎంతతీవ్రంగా కృషిచేస్తున్నప్పటికీ బకాయీలు పెరిగిపోతున్నవి. 1954 అక్టోబరునుంచి 1955 ఆగస్టు వరకు ఉండిన డిమాండు, వసూలు నిలవల అంకెలు ఇవి: డిమాండు రూ 4,07,47,086 లు; వసూలు రూ. 3,10,55,954 లు; బకాయీ రూ. 96,91,132 ఈ మూడు పద్దులక్రింద ఉండిన బకాయీలు వరుసగా ఇవి: రూ. 4,46,71,815 లు: రూ. 51,42,417 లు; రూ. 3,95,29,398 లు.

రాష్ట్రంలో మద్యనిషేధానికితొలిచర్యగా, నల్లమందు విషయమై తగు చర్యలు గైకొనబడినవి. 1959 ఏప్రిల్ 1 నుంచి నల్లమందువాడకం నిషేధించ బడుతుంది. 1956 జూలై వరకు నల్లమందుకు అలవాటుపడిన వారిని రిజిష్టరు చేయుటకు ప్రాథమిక చర్యలు గైకొనబడినవి. అంతర్జాతీయ నిబంధనల కనుగుణంగా గత 6 సంవత్సరాలనుంచి ప్రభుత్వం ప్రతియేటా దుకాణాలకు నల్లమందు సరఫరాను 10 శాతం తగ్గిస్తున్నది.

నల్లగొండజిల్లాలో సర్వేలు, యాదగిరి గుట్ట గ్రామాలలోను, వాటికి చుట్టుప్రక్కలా రెండున్నర మైళ్లవరకు ఎక్కడకూడా మత్తు పదార్థాల విక్రయం జరుగకుండా నిషేధించబడింది. వొరంగాబాదు జిల్లాలో వాడిగద్రియము గ్రామంలో స్థానిక ప్రజల కోరికపైన సారా, కల్లుదుకాణాలు మూసివేయబడినవి. ప్రభుత్వం తయారుచేసిన నీరా నియమావళి ప్రకారం, తాటిబెల్లం పరిశ్రమను ప్రోత్సహించుటకు వాణిజ్య పరిశ్రమలశాఖ సిఫార్సుపైన, గీయుటకు చెట్లు కేటాయించబడినవి.

అబ్కారీచట్టం సవరించబడింది. తత్ఫలితంగా పట్టేదార్లకు భూముల యజమానులకు తమ భూములలో అక్రమంగా గీయు చెట్లను ఆపివేయు బాధ్యత వప్పగించబడింది.

## సర్వే మరియు సెటిల్మెంటు

వివిధ తాలూకాల సర్వే, వర్గీకరణ కార్యక్రమం జమాబందీ నివేదికల సమర్పణ, మాజీ సర్ఫేఖాస్ గ్రామాలలో విపరీత

పన్నుల పరిశీలన పనులు సక్రమంగా కొనసాగుతున్నవి. గత సంవత్సరంలో 863 గ్రామాలకేసులు తనఖీ చేయబడినవి. వీటిలో 169 గ్రామాలలో పన్ను రేటు పరిసర దివానీ గ్రామాలలోకన్న ఎక్కువగా ఉండినట్లు కనుగొనబడింది. అక్కడి రేట్లను ఇతరచోట్ల రేట్లకు సమానంగా తీసుకొని వచ్చుటకు అవసరమైన చర్యలు గైకొన బడుతున్నవి.

1955 జూన్‌లో రాష్ట్రమంతటా వ్యవసాయ ఆర్థిక భోగట్టా సేకరించుటకు పని ఆరంభించబడింది. ఇది 1956 జూన్‌నాటికి పూర్తికాగలదని ఆశింపబడుతున్నది. అప్పుడు పన్ను వసూలు రేట్లను సవరించేవిషయమై ప్రభుత్వానికి సూచనలు అందజేయబడుతాయి.

1956-57 సం.లో మాఫీ జాగీరుగ్రామాలకు అధిక ప్రాధాన్యం ఇచ్చుటకు తలపెట్టబడింది, వచ్చేసంవత్సరం జూన్‌లోగా మిగిలిన 160 మాఫీ-గ్రామాల విషయంలో జమాబందీ పని పూర్తి అవుతుంది. మాఫీ-జాగీరు గ్రామాలన్నిటి విషయమై ప్రకటనలు చేయబడవచ్చు.

## రిజిస్ట్రేషన్ మరియు స్టాంపులు

రిజిస్ట్రేషన్ మరియు స్టాంపులు—ఈ రెండు ప్రత్యేక శాఖలకు అధిపతి ఇనస్పెక్టర్ జనరల్. ఈయన ప్రభుత్వ అదాలత్ వకీలు (రాయసగాడు) పనినికూడా నిర్వహిస్తారు. జిల్లా రిజిస్ట్రార్లు, సబ్-రిజిస్ట్రార్లు చేయుపనిని కంట్రోల్ చేస్తారు. 1908 సం. ఇండియన్ రిజిస్ట్రేషన్ చట్టం, 1331 ఫ. హైద్రాబాదు స్టాంపుచట్టం, 1324 ఫ. హైద్రాబాదు కోర్టుఫీజు చట్టముల క్రింద సంక్రమించిన అధికారాలుగాక, పత్రాలరిజిస్ట్రేషన్‌పైగల నిర్బంధనలకు సంబంధించినంత వరకు, 1950 సం. హైదరాబాదు కౌల్దారీ మరియు వ్యవసాయ భూముల చట్టం, 1948 సం. హైద్రాబాదు కాందిశీకుల ఆస్తి చట్టాల తాలూకు జారీ యగు ఉత్తర్వులు అమలు జరుగునట్లుకూడా ఆయన చూస్తారు. స్థిరాస్తిమారకంపై పన్నువసూలు పనిని కూడా ఇనస్పెక్టర్-జనరల్ నిర్వహిస్తారు.

హైద్రాబాదు జిల్లాకలెక్టరు తప్ప మిగతా జిల్లాకలెక్టర్లు 1953 మే 16 నుంచి అధికార జిల్లా రిజిస్ట్రార్లుగా పనిచేస్తున్నారు

హైదరాబాదులో ఒక జిల్లా రిజిస్ట్రారు ఆఫీసు వుంది. రాష్ట్రంలో 99 సబ్-రిజిస్ట్రార్ ఆఫీసులున్నాయి. హైదరాబాదు మరియు వ్యవసాయఋణములచట్టం, మరియు సహకార సంఘాలచట్టం క్రింద కొన్ని మినహాయింపులు మంజూరయినందువల్ల రిజిస్ట్రేషన్ శాఖ ఆదాయం చాలావరకు పడిపోయింది. అయితే అబ్కారీ గుత్తాలు, గిరవీపత్రాలు, సెక్యూరిటీ పత్రాలను తప్పనిసరిగా రిజిస్టరు చేయవలెనని ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసినందువల్ల ఆదాయం కొద్దిగా పెరగవచ్చు. రిజిస్ట్రేషన్ ఫీజు విషయంలో కొంత రియాయతీ ఇవ్వబడుతుంది.

ధర్మాదాయ సంస్థలు

మతశాఖరద్దు అయ్యే అంతిమ రోజులలో అది 3000 మత, ధర్మసంస్థలను రిజిస్టరుచేసింది. ఈశాఖ చేయుపనిని ఇప్పుడు ధర్మాదాయశాఖ చురుగ్గా కొనసాగిస్తున్నది. ఇప్పుడు అట్టి సంస్థలు రాష్ట్రంలో 76261 ఉన్నవి. వాటిలో 17582 ముస్లింసంస్థలు. ఈ ముస్లిం సంస్థలు 1955 జనవరి 15 నుంచి ముస్లిం వక్ఫ్‌బోర్డు యాజమాన్యం క్రిందికి తేబడినవి. 1954 సం. కేంద్ర వక్ఫ్‌చట్టం క్రింద అనధికారసభ్యులతో కూడిన వక్ఫ్‌సంఘం నెలకొల్పబడింది.



నాందేడులోని సిక్కుగురుద్వారం

ఈశాఖ, నాందేడులోని శిక్కు గురుద్వారా యాజమాన్యాన్ని వహించిన తరువాత, దాని పరిపాలన నిర్వహణ సక్రమంగా జరుగుతున్నది. గురుద్వారా ఆదాయంలో నిలవగాపున్న రూ. 7 లక్షల డబ్బులోనుంచి రెండు లక్షల రూపాయలు నాందేడులో 10 ప్రదర్శన భవనములు 16 నివాసగృహములు నిర్మించుటకు వినియోగింపబడినవి. నాందేడు పీపుల్స్‌కాలేజీకి వడ్డీలేకుండా రూ. 20000 లు అప్పుగా ఇవ్వబడినవి. ఈ డబ్బు 20 సంవత్సరాలలో చెల్లించబడుతుంది. గురుద్వారా, విద్యార్థుల ఉపకారవేతనములకు, సాంఘిక సంక్షేమ కార్యకలాపాలకు విశేషంగా విరాళాలిస్తున్నది.

1951 సం. లో ధర్మాదాయ నిధులను సేకరించి నిర్వహించవలెనని ప్రభుత్వం నిర్ణయించినందువల్ల 11 మార్కెట్లలో ధర్మాదాయ కమిటీలు ఏర్పాటు చేయబడినవి. వీటిని ఇంకనూ యెక్కువగా నెలకొల్పుటకు తలపెట్టబడింది. సేకరించబడిన నిధులలోనుంచి విద్య, సాంఘిక, మరియు దానధర్మాలకు మొత్తములు కేటాయించబడినవి. ఈవిధంగా జాతినిర్మాణ కార్యక్రమాల అమలుకు రూ. 2 లక్షలు కేటాయించబడినవి. భవిష్యత్తులు ఇట్టి కేటాయింపులు ఎక్కువ చేయుటకు తలపెట్టబడింది.

వివిధ సంస్థలు విద్యా ప్రయోజనాలకొరకు కేటాయించు డబ్బును ఒకచోచేర్చి, విద్యార్థుల అర్హత ఆదాయాల ఆధారంపై వారికి ఉపకార వేతనము లిచ్చుటకు ఒక పథకం తయారు చేయబడింది. ఈ పథకంక్రింద విద్యార్థులకు గతసంవత్సరం రూ. 6000 ల మేరకు ఉపకార వేతనములు ఇవ్వబడినవి. వేములవాడ శ్రీ రాజరాజేశ్వరస్వామి దేవాలయంలో విద్యుద్దీపాలేర్పాటు చేయబడినవి. ఈ దేవాలయానికి ఒక జనరేటరు వుంది. వేములవాడ పట్టణానికి కూడా విద్యుచ్ఛక్తి సరఫరా చేయుటకు తలపెట్టబడింది. భద్రాచలంలో శ్రీరామదేవాలయానికి రెండు లక్షల రూపాయలు ఖర్చుపెట్టి, దానిని అభివృద్ధిపరచుటకు ప్రతిపాదనలు చేయబడినవి. వివిధ సంస్థలు విద్యుచ్ఛక్తి సరఫరాచేయుటకు సొంతంగా పథకములు తయారు చేసుకొన్నవి.

ఈశాఖ, ముఖ్య మతసంస్థలనుగూర్చి కరపత్రములను ప్రచురిస్తున్నది. ఫిల్ములు, రేడియో ప్రసంగములు ప్రదర్శనములు, జాతరలు మున్నగువాటిద్వారా ప్రచారకార్యక్రమమును కూడా ఈ శాఖ నిర్వహిస్తున్నది.

## నిజామత్ అతియాత్

నాజిం అతియాత్ పని, అతియాత్ ఇహ్తె దాయి, ఇంతెజామి అతియాత్, అతియాత్ నక్దీ అను మూడు ప్రధాన పద్దులక్రింద విభజింప బడియున్నది.

ఇనాములు, జాగీర్లు, సంస్థానముల వారసత్వానికి సంబంధించిన విచారణల కేసులను అతియాత్ ఇహ్తెదాయి పరిష్కరిస్తుంది. జాగీర్లు రద్దుకావడం దృష్ట్యా క్రొత్తగా జాగీర్ల వారసత్వానికి సంబంధించిన కేసులు విచారణకు తీసుకోబడటం లేదు. అయితే జాగీర్లు, ఇతర గ్రాంటులకు సంబంధించిన క్రొత్తగావచ్చు ఇనాం విచారణకేసులు పరిశీలించబడుతాయి. మాజీ-సూబేదార్లు, కలెక్టర్లు ఇచ్చిన తీర్పులపై వచ్చు అప్పీళ్ళను నాజిం విని పరిష్కరిస్తారు.

అతియాత్ ఇంతెజామీలో ఇనాములు వారసత్వ విచారణలకు సంబంధించనట్టి విషయములు నాజించే పరిష్కరింప బడుతాయి.

అతియాత్ నక్దీలో నగదు గ్రాంటులు, ఇనాములకు సంబంధించిన పన్నులు, మన్సబులు, మామూళ్ళు, సాలియానాలు మున్నగువాటికి చెందిన వారసత్వపు విచారణలు పరిష్కరించబడుతాయి. ఈ పనులను వాటికి సంబంధించిన అధికారులు నిర్వహిస్తారు. ఆఫీసర్ల ఉత్తర్వులపైవచ్చు అప్పీళ్ళను నాజిం అతియాత్ విచారిస్తారు.

## కోర్ట్ ఆఫ్ వార్డ్స్

1353 ఫ. హైదరాబాదు కోర్ట్ ఆఫ్‌వార్డ్స్ చట్టంద్వారా సంక్రమించిన అధికారాలను పురస్కరించుకొని మతిభ్రమణ కలిగిన వారు, మైనర్లు, విధవలు మున్నగు అర్హతలేని యజమానుల ఆస్తిని కోర్ట్‌ఆఫ్‌వార్డ్స్ కాపాడుతుంది. ప్రతిసంవత్సరం కొన్ని ఎస్టేట్లు వాటివాటి యజమానులకు విడుదల చేయబడుతాయి. కొన్ని దీని పర్యవేక్షణ క్రిందికి వస్తాయి. ఇపుడు దీని కంట్రోల్ క్రింద వున్న 30 ఎస్టేట్లలో 16 జాగీర్లు, 14 జాగీర్లు కాని ఎస్టేట్లున్నాయి. జాగీర్ ఎస్టే

ట్లకు కమ్యూటేషన్ మొత్తములు తీసుకోబడుతాయి. జాగీర్లుకాని ఎస్టేట్లకు భూమి శిస్తువసూలు చేయబడుతాయి. కొన్ని ఎస్టేట్లలో బంగ్లాలు, మడిగెలు సంక్రమంగా నిర్వహించబడుతున్నవి. వాటిపై కిరాయలు వసూలు చేయబడుతున్నవి. సెక్యూరిటీల పైనవచ్చు వడ్డీకూడ వసూలు చేయబడుతున్నది. అఫ్జల్ ఖాన్ ఎస్టేటుకు చెందిన పెద్ద అటవీ ప్రాంతాన్ని ఒక అడవుల డిప్యూటీ రేంజి ఆఫీసరు, ఈ ఎస్టేట్లకై నియమింపబడిన స్పెషల్ ఆఫీసరు జాగ్రత్తపరుస్తున్నారు. ప్రతి ఎస్టేటుకు సాలీనా బడ్జెటు తయారు చేయబడుతున్నది. దానికి ప్రభుత్వం మంజూరీ ఇస్తున్నది. 1955-56 ఆర్థిక సంవత్సరానికి అన్ని ఎస్టేట్లపైన ఆదాయం రూ. 3,33,966 లు వస్తుందనీ, ఖర్చు రూ. 2,52,632 లు అవుతుందనీ అంచనా వేయబడింది. 1955 ఏప్రిల్ 1 నుంచి 1956 ఫిబ్రవరి 7 వరకు అంకెల వివరాలు ఇవి : ఆదాయం రూ. 2,43,370 లు; ఖర్చు రూ. 2,01,238 లు. కోర్ట్స్ ఆఫ్ వార్డ్స్ నిర్వహణకు ఖర్చుక్రింద రూ. 46,167 లు ప్రభుత్వానికి జమకట్టబడినవి.

జాగీర్లు విలీనమయిన తరువాత పెద్ద మొత్తున ఉద్యోగసిబ్బందిని తొలగించడం, జిల్లాల్లో ఎగ్జిక్యూటివ్ పదవులు రద్దుచేయడం జరిగింది. తత్ఫలితంగా కోర్ట్ ఆఫ్ వార్డ్స్‌యొక్క అసిస్టెంటు నాజిం ఎస్టేట్ల పరిరక్షణకై అక్కడ తరచుగా పర్యటనలు చేస్తారు.

అఫ్జల్ ఖాన్ ఆస్తులు మునుపటి హైద్రాబాదు దారుల్ ఖజాకోర్టు తీర్పు ఇచ్చినట్లుగా ఎస్టేటువారసుల మధ్య పంచిపెట్టబడుతాయి. కోర్ట్ ఆఫ్ వార్డ్స్ పాత డిపాజిటు అకౌంట్‌లో రూ. 2 లక్షలు నిలవయున్నవి. ఈ అకౌంటు 1951 ఏప్రిల్ 1 న మూసివేయబడింది. ఈ మొత్తం విడుదల చేయబడిన ఎస్టేట్ల యజమానులకు, బకాయీలు ఏవైనా వుంటే రాబట్టుకొని, తిరిగి చెల్లించబడుతుంది.



# నీటివసరులు

ప్రాజెక్టులక్రింద నీటివసరులను అభివృద్ధి పరచే పని భూమ్యాదాయ శాఖ కార్యక్రమంలో ఒక భాగంగా వున్నది. ఈ పనిని రెవిన్యూబోర్డుయొక్క సీనియర్ సభ్యుడు పర్యవేక్షణచేస్తూ వుంటాడు. ఆయనే డెవలప్‌మెంట్ కమీషనరుగా రాష్ట్ర అభివృద్ధి సంఘంక్రింద పనిచేస్తూ ఉంటాడు.



*బెందుసురా ప్రాజెక్టునుంచి నీరు విడువబడుట.*

నీటి వనరుల ప్రాజెక్టులక్రింద గల ప్రాంతాలు ఒక ప్రత్యేక పరిపాలనా యూనిటు అజమాయిషీలో పెట్టబడినవి. అందు వల్ల ఆ ప్రాంతాల అభివృద్ధి సమస్యపట్ల తగుశ్రద్ధవహించడానికి వీలుకలుగుతుంది. భూమ్యాదాయ శాఖలో మామూలుగాపనిచేసే ఉద్యోగులు, సిబ్బంది నీటివనరుల అభివృద్ధి బాధ్యతలను వహించడానికి సరిపోరు. కనుక అనేక భారీ, మధ్యరకం ప్రాజెక్టులలో ప్రత్యేకంగా డెవలప్‌మెంటు ఉద్యోగులు నియమింపబడినారు. ఈ ఉద్యోగులకు ఈ క్రింది పనులు అప్పగించబడినవి :

(1) శిబిరములు, రోడ్లు, మునిగిపొయ్యేప్రాంతం, కాలువలు, పిల్లకాలువలు మొదలగు వాటికి అవసరమైన భూములను స్వాధీనపరచుకోవడం.

(2) పరిహారం చెల్లింపు.

(3) రెవిన్యూ సర్వే, సెటిల్మెంట్ చెల్లింపుల నిర్ధారణ.

(4) మునిగిపొయ్యే గ్రామాలప్రజలకు, ప్రాజెక్టు కొరకు స్వాధీన పరచు కొనబడిన భూముల తాలూకు వ్యక్తులకు పునరావాసం కల్పించడం.

(5) పంటల పథకములను తయారుచేయడం; ప్రాజెక్టుక్రిందవున్న గ్రామా లలో వివిధ పంటలకు ఆయకట్టును స్థిరీకరించడం, నీటిపారుదల విస్తృతిని నిర్ణయించడం.

(6) భూముల కేటాయింపు, తక్కావీ అప్పుల పంపిణీ, ఎరువుల సరఫరా, పొలాలలో కాలువలు త్రవ్వడం.

(7) భూములను బాగుపరచి సాగుకు తేవడం, ఖుష్కీ భూమిని తరీ భూమిగా మార్చడం, మొదటిపంట రెండవపంటను వేసే అవకాశాలను పరిశీలించడం, జలాశయముల నీటిని లాభసాటిగా ఉపయోగించడం.

(8) గ్రామాలను అభివృద్ధిపరచడం; భూమ్యాదాయ చట్టం తదితర చట్ట ముల ననుసరించి ఇతర విధులను నిర్వర్తించడం.



భీమానదిపై వంతెనకు కేంద్రమంత్రి శ్రీ బి. యస్. దతార్ రిబ్బను కత్తిరించి ప్రారంభోత్సవం చేశారు.

దాదాపు 30 కి పైగా వున్న సీటివనరు ప్రాజెక్టులక్రింద అభివృద్ధి కార్యక్రమాన్ని త్వరితగతిని కొనసాగించడానికి దోహదం చేసే పథకాలకు డబ్బుపెట్టుబడి పెట్టడానికై ప్రభుత్వం ప్రతియేటా రూ. 10,000 లు డెవలప్మెంటు గ్రాంట్లుగా మంజూరు చేసింది. ఈ మొత్తం డెవలప్మెంటు కమీషనర్‌కు అప్పగించబడింది. ఆయన వివిధశాఖలయొక్క పథకములను సేకరించి, వాటిని పరిశీలనచేసి, వాటి ఆదాయ వ్యయ అంచెనాలను తయారుచేసి, ఆ పథకములను అమలు పరిచే ముందుగా రాష్ట్ర అభివృద్ధి సంఘంయొక్క ఆమోదాన్ని పొందుతాడు.

వివిధ పథకముల అంచెనాలను వాటికి సంబంధించిన శాఖలు తయారుచేస్తాయి. ఆ అంచెనాలను ఆర్థిక ఉపసంఘం పరిశీలన చేస్తుంది. అభివృద్ధి కార్యకలాపాలు కొన్నేండ్ల పర్యంతం జరుగుతూ ఉంటాయి కాబట్టి ఈ పథకాలు దీర్ఘకాలిక ప్రాతిపదికపై తయారుచేయబడుతాయి.

తుంగభద్రక్రింద 20 పథకములు, నిజాం సాగర్‌క్రింద 9 పథకములు, మధ్యరకం ప్రాజెక్టులక్రింద 16 పథకములు అమలు జరుగుతున్నవి.

తుంగభద్ర ప్రాజెక్టు క్రింద జరిగిన ప్రధాన కార్యక్రమాలలో నిర్వాసులైన వారికి ఆవాసం కల్పించడం ఒకటి. దాదాపు 5,000 మందికి పునరావాసం కల్పించడానికై 28 కొత్త కాలనీలు ఏర్పాటు చేయబడినవి. ముఖ్యంగా కొప్పల్‌వద్దగల భాగ్యనగర్ కాలనీ ప్రత్యేకంగా చెప్పదగినది. పునరావాస కార్యక్రమంపై రూ. 52,00,000 లు ఖర్చుపెట్టబడినవి. కడం, ఖాసాపూర్ ప్రాజెక్టులలో కూడా ఇట్టి పనే జరుగుతున్నది.

నిజాంసాగర్ ప్రాజెక్టుక్రింద గత 12 ఏండ్లనుంచి పథకములు అమలు జరుగుతున్నవి. పశువుల పోషణ, వ్యవసాయం, వైద్యం మున్నగు విషయాలపై చాలా పరిశోధనలు జరిగినవి.

తుంగభద్రప్రాజెక్టు క్రింద జరుగుతున్న వివిధ కార్యకలాపాలకై ప్రభుత్వం రూ. 54,00,000 లు తక్కావీ అప్పుగా ఇచ్చింది. ఇట్లే నిజాంసాగర్‌క్రింద పనులకు రూ. 5,00,000 లు, ఇతర మధ్యరకం ప్రాజెక్టుల

పనులకు రూ. 7,50,000 లు తక్కావీ అప్పులు ఇవ్వబడినవి. ఈ అప్పులను రెవిన్యూ బోర్డు సీనియర్ సభ్యుని అజమాయిషీక్రింద స్థానిక అధికార్లు తయారుచేసినట్టి ప్రత్యేక నియమావళి ననుసరించి పంపిణీ చేయబడినవి.

హైదరాబాదు రాష్ట్రంలో ప్రారంభింప బడిన మొట్టమొదటి భారీప్రాజెక్టు నిజాంసాగర్. ఈ ప్రాజెక్టుపని మొదలైన 10 ఏండ్ల వరకు దాని క్రింది అభివృద్ధిపని సాధారణ రెవెన్యూ సిబ్బందికి అప్పగింపబడింది. అయితే ఈ విధానంవల్ల ప్రాజెక్టు అవసరములు తీరలేదు. భారతదేశంలోని నీటి వన రుల ప్రాజెక్టుల పద్ధతినిబట్టి ఇక్కడ కూడ పూర్వపువిధానం మార్చబడింది. ప్రత్యేకంగా డెవలప్‌మెంట్ ఉద్యోగులు నియమింపబడినారు. ఇటువంటి ప్రత్యేకపు ఏర్పాట్లు జరిగిన పిమ్మటనే నిజాంసాగర్ అభివృద్ధిపని సంతృప్తికరంగా కొనసాగింది. ఫలితంగా ఆయ కట్టుయొక్క పూర్తిపని త్వరలో ముగియనున్నది. అప్పుడు ఈ ప్రాజెక్టుక్రింది ఆయ కట్టు అంతా అనుకున్నప్రకారం అభివృద్ధి చెందినట్లవుతుంది. ఇతర ప్రాజెక్టులక్రింద కూడా ఇదే విధానం అవలంబించ బడుతున్నది.

కేవలం ప్రాజెక్టు కట్టినంతమాత్రాన ఆర్థికసంపద చేకూరదని ఇంతవరకు కలిగిన అనుభవాన్నిబట్టి తెలుస్తున్నది. ప్రాజెక్టు నీటిని బాగా వినియోగించుకొని సేద్యం చేసుకోవలసి వున్నది. ఇది ఒక సమస్య. ఈ సమస్యను ముందుగానే ఆలోచించి తగు సహాయావకాశాలు కల్పించవలసి వుంటుంది ప్రాజెక్టు నిర్మాణానికి ఎంత పెట్టుబడి పెట్టబడిందో అభివృద్ధి పథకాలకు, అందుకవసర మైన ఉద్యోగులకొరకు దాదాపు అంతేమొత్తం ఖర్చుచేయవలసి వుంటుందని వ్యవ సాయంలో, అర్థశాస్త్రంలో నిపుణులయినవారు అంటారు. ఈ అభిప్రాయాన్ని అనుస రించి హైదరాబాదు ప్రభుత్వం పైన పేర్కొన బడిన ప్రత్యేకపుఏర్పాటు చేసింది.

ఇదేవిధంగా నాగార్జునసాగర్, ఇతర మధ్యరకం ప్రాజెక్టులక్రింద భూముల పరిశీలన, రెవెన్యూసర్వే, ఆయకట్టు స్థిరీకరణ పనులు జరుగగలవు.

*తుంగభద్ర ప్రాజెక్టు*

తుంగభద్ర పెద్దకాలువపొడవు 140 మైళ్లు. 121 మైళ్ళ వరకు ఈ కాలువలో శాశ్వతంగా నీరు వుంటుంది. పెద్దకాలువ

నిర్మాణం పని 101 మైళ్ళవరకు కంట్రాక్టర్ల కివ్వబడింది. 58 వ మైలువరకు త్రవ్వకం పని జరిగింది. 42 వ మైలువరకు లైనింగు వేయడం పూర్తయింది. గత సంవత్సరం 20 వ మైలువరకు పిల్లకాలవలపని పూర్తయింది. ఈ సంవత్సరం పని ప్రారంభమై నప్పటినుంచీ 25 నుంచి 30 వ మైలువరకు పని చురుగ్గా సాగుతున్నది.

1955-56 వ్యవసాయ సంవత్సరంవరకు పాతతరీ భూములుకూడా కలుపుకొని మొత్తం 16,000 ఎకరాలకు తుంగభద్ర కాలవ క్రింద నీటిసరఫరా జరిగింది. వచ్చే వ్యవసాయ సంవత్సరం వరకు అదనంగా 25,000 ఎకరాలను తరీ సాగు క్రిందికి తేవడానికై కలెక్టరు తలపెట్టినాడు.

అభివృద్ధి కార్యక్రమముయొక్క విశేషాలు ఈ దిగువవిధంగా వున్నవి :

*ఆయకట్టు స్థిరీకరణ*

లోకలైజేషన్ పార్టీలో వ్యవసాయ యూనిట్లకు అదనంగా సిబ్బందిని మంజూరుచేయడంతో అనుకున్నట్లుగా జరుగకుండా వుండిపోయిన ఆయకట్టు స్థిరీకరణ కార్యక్రమం ఇప్పుడు చురుకుగా సాగుతున్నది. లోకలైజేషన్ పార్టీకి ఆయకట్టు గ్రామాలను సమగ్రంగా సర్వేచేయడం, ఒక్కొక్క గ్రామంలో వివిధ పంటలక్రిందికి వచ్చేభూములను విభజించి చూపడం మొదలగు బాధ్యతలు అప్పగింపబడినవి. తుంగభద్ర కాలవక్రింద 5,80,000 ఎకరాలభూమి సాగు కాగలదు. ఇందులోనుంచి 1,28,700 ఎకరాలభూమియొక్క ఆయకట్టు స్థిరీకరణను లోకలైజేషన్ పార్టీవారు జరిపినారు. దీనివల్ల ప్రతి భూకామందు కాలవనీటివల్ల తాను ఎంతవరకు లాభపడేదీ తెలుసుకొని అతనికి కేటాయించబడిన పైరులను వేయడానికి ఆయత్తం అవుతాడు. ఇంతేగాక దీనివల్ల నీటివనరులశాఖవారు చాలా సులభంగా పిల్లకాలవలను, ఉపకాలవలను తీర్చి త్రవ్వించగలుగుతారు.

*భూములసాగుబడి*

దాదాపు 75,000 వేల ఎకరాలభూమి ఖారీ నీటిపారుదల క్రిందికి వస్తుంది. ఈ భూమి ఎక్కువగా కాలవల పరిసరాలలో

వుంటుంది. ఎక్కడో మామూలగ్రామాలలో పాతకాలపక్రింద సాగయ్యే తరీ భూములు తప్ప ఇతరత్రా చాలామంది రైతులకు భారీ సీటిపారుదల కొత్తవిషయమని చెప్పవలెను. అందుకొరకు వారికి తగినడబ్బులేదు, నేర్పూ లేదు. ఇంతవరకు దాదాపు అన్నిభూములు ఖుష్కీ సేద్యంక్రింద వున్నవి. ఆ భూములను తరీభూములుగా మార్చా లంటే భూమిని సమతలంగా చేయాలి. గట్లు అమర్చాలి. నీటిని నిలవచేసుకునే విధంగా భూమిని బాగుపరచుకోవాలి. కనుకనే ట్రాక్టర్లు బుల్ డోజర్లతో, ఇతరభారీయంత్రాలతో భూమిని సాగుకు తెచ్చే విధానాన్ని రైతులకు ప్రదర్శించడానికై తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతంలో పైలెట్ స్కీమును అమలు జరపడానికి ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది. కమ్యూనిటీ ప్రాజెక్టు నిధులనుంచి ఇందుకొరకు కొద్దిగా యంత్రములు ఇవ్వబడినవి. వాటి నిర్వహణకు అయ్యే ఖర్చు డెవలప్మెంటు గ్రాంటునుంచి భరించబడింది.

గత ఒకటిన్నర సంవత్సరాలలో దాదాపు 5,000 ఎకరాల బాదువాభూములు కొత్తగా దున్నబడినవి. యంత్రాలవల్ల భూములను సాగుకుతేవడం లాభకరమని భూకామందులు గుర్తించినారు. అందుచేతనే చాలామంది యంత్రాలు కావాలని కోరుతున్నారు. అట్లావారికి సరఫరాచేయడానికై రూ. 15,00,000ల ఖర్చుతో భారీయంత్రాలను కొనడానికి ప్రభుత్వం మంజూరీ ఇచ్చినది. ఈ యంత్రాలు ఏడాదిలో దాదాపు 10,000 ఎకరాల భూమిని దున్నగలవు. ఈ కార్యక్రమమంతా లాభ నష్టములు లేనివిధంగా నిర్వహింపబడుతున్నది.

## ప్రదర్శనస్థలాలు

భారత ప్రభుత్వం చేసిన సహాయంవల్ల గతసంవత్సరం రెండుమొదలు మూడేసి గ్రామాలకు ఒకటిచొప్పున ప్రదర్శన స్థలములు 34 పెట్టబడినవి. ఒక్కొక్క స్థలములో 5 ఎకరాలభూమి వుంటుంది. ఈ 5 ఎకరాలలో భూములను సాగుకుతేవడం, పైరుల ఏర్పాట్లు, పైరుల మార్పిడి, పొలాలలో కాలవలు త్రవ్వడం, కట్టలు వేయడం మొదలగు పనులు ప్రదర్శించి చూపబడుతాయి. ఇటువంటి స్థలాలు గ్రామానికి ఒకటిచొప్పున వుండాలని తలపెట్టబడింది. వచ్చే సంవత్సరం మరి 50 ప్రదర్శన స్థలాలను పెట్టాలని సలహాసంఘం సూచించింది. ఈ స్థలాలు పట్టేదార్ల పొలంలో పెట్టబడుతాయి. ప్రభుత్వంచేసే పనిదృష్ట్యా ఆ భూకామందునుంచి మేలిరకం విత్తనాలరూపంలో కొద్దిగా వ్యవసాయోత్పత్తికి తీసుకోబడుతుంది. ఆ విత్తనాలు పేదరైతులకు ఉచితంగా సరఫరాచేయబడుతాయి.

రైతులు ఎద్దులను, నాగళ్లను, ఎరువును, విత్తనాలను కొనుక్కునేందుకై సులభపద్ధతిపై అప్పులను ఇవ్వడానికిగాను వచ్చే సంవత్సరంకొరకు ప్రభుత్వం రూ. 20,00,000 లు ఇవ్వడానికి నిర్ణయించింది. ఈ మొత్తం 10 ఏండ్లలో సరిసమాన వార్షిక కిస్తులుగా రాబట్టుకోవడమవుతుంది. ఇలా చెల్లించడానికి మొదట కొంత రియాయితీ గడువు ఇవ్వబడుతుంది. ఎరువులు, విత్తనాలు సరఫరాచేయడానికై వ్యవసాయశాఖ కొత్త గిడ్డంగులను నెలకొల్పాలని సూచింపబడింది. సబ్సిడీలిచ్చి జనపకట్టె మొదలగు పచ్చి ఎరువులను పెంచడానికి ప్రోత్సాహమివ్వబడుతుంది.

## పశువుల పెంపకం

ప్రస్తుతమున్నట్టి వ్యవసాయక జాతుల పశువులను వృద్ధిచేయవలసిన ఆవశ్యకతను ప్రభుత్వం గుర్తించింది. వ్యవసాయక పశువులు కొనడానికి ప్రభుత్వం తక్కావీ అప్పులిస్తుంది. కృష్ణాలోయ ఆవులను కొనడానికీ ముసీరాబాదు క్షేత్రంలో పశుపెంపక కార్యకలాపాలను విస్తృతీకరించడానికి ప్రభుత్వం ఒక పథకాన్ని మంజూరుచేసింది. పశువులలో కృత్రిమ గర్భోత్పత్తి విధానానికి ప్రోత్సాహ మివ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఇందుకొరకై మూడు కేంద్రాలు, ఒక సంచారకదళం వెంటనే నెలకొల్పబడినవి.

## పొలాలలో కాలువలు త్రవ్వడం

పొలాలలో కాలువలు త్రవ్వడానికి ప్రభుత్వం రూ. 5,00,000 లు కేటాయించింది. అసలు ఈ పనిని చేయించుకోవలసిన బాధ్యత రైతులపై వున్నది. అయితే దీనికి కొంత సాంకేతిక పరిజ్ఞానం అవసరం కావడంవల్లను, ఈ పనిని రైతులకు వదలివేసినట్లయితే సరిగా జరుగుతుందో లేదో అనే సందేహం వుండడంవల్లను ఈ మొత్తమును పబ్లికు వర్క్సుశాఖకిచ్చి, ఆశాఖ చేతనే పనిని జరిపించడానికి తలపెట్టబడింది. ఈ పనికి ఎకరానికి 10 రూ. లు ఖర్చు అవుతుంది. ఆ ఖర్చును ప్రభుత్వము, రైతులు సరిసమానంగా భరించవలసి వుంటుంది.

ఆయకట్టు గ్రామాలలో ప్రజారోగ్యమును బాగుపరచడానికీ, రోడ్లు వేయడానికీ ఒక పథకం మంజూరు చేయబడింది.

గ్రామస్థులకు పనిలేనికాలంలో మేకలు గొర్రెలు పెంచడం, కోళ్ళ పెంపకం, తివాచీలు నేయడం, కంబళ్లు తయారుచేయడం, మొదలగు పనులను కల్పించడానికై పథకములు మంజూరు చేయబడినవి. ప్రాజెక్టుక్రింద అభివృద్ధి పనిని త్వరగా జరిపించే పథకముల కొరకై ప్రభుత్వం రూ. 50 లక్షలు కేటాయించడానికి నిశ్చయించింది.

★

## జాగీరు పరిపాలన

జాగీరుల నియమావళిక్రింద జాగీర్దార్లకు చెల్లించవలసిన పరిహారం మొత్తమును జాగీరు ఎడ్మినిస్ట్రేటర్ కార్యాలయం నిర్ణయిస్తుంది. తాత్కాలిక పరిహారములను సాధ్యమైనంత త్వరగా జారీచేయుటకై ప్రత్యేక గుమాస్తాలను పంపి తహసీళ్ళనుంచి అవసరమైన భోగట్టాను తెప్పించడానికి ప్రత్యేక ప్రయత్నములు చేయబడుతున్నవి. ఈవిధంగా 1956 మార్చి నెలాఖరువరకు 1200—1300 జాగీరుల పరిహారములు జారీచేయబడగలవని ఆశింపబడుతున్నది. మిగతాజాగీర్ల పరిహారములు 1956—57 లో జారీచేయబడవచ్చు. అదే సంవత్సరంలో అనేకకేసుల విషయంలో అంతిమ పరిహారములు జారీచేయబడగలవు.

ఇంకా దాదాపు 200 జాగీరుల జాగీర్దార్లు అవసరమైన పత్రములు దాఖలు చేయలేదు. అందుచేత వారికి పరిహారం చెల్లింపబడలేదు.

1956 మార్చి 31 తేదీవరకు రూ. 94.95 లక్షల ఇంటెరిం అలవెన్సులు చెల్లింపబడినవి. రూ. 522.09 లక్షల పరిహారం చెల్లింపబడింది. వచ్చే ఆర్థిక సంవత్సరంలో దాదాపు 10,000 మంది వ్యక్తులకు రూ. 116.64 లక్షలవరకు డబ్బు చెల్లింపబడవచ్చు.

రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ జరుగనున్నందువల్ల అప్పులను ఆస్తులను ప్రాంతాలవారీగా పంపిణీ చేయుట కొరకై జాగీరు ఎడ్మినిస్ట్రేటర్ కార్యాలయం భోగట్టాను సేకరించవలసి వున్నది.

1949 సెప్టెంబరు నెలలో హైద్రాబాదు రాష్ట్రంలో 6500 గ్రామాలు గలిగి రాష్ట్రవిస్తీర్ణంలో దాదాపు మూడోవంతుగల మొత్తం

1500 జాగీర్లు రద్దు అయిన తరువాత వాటి స్థితిగతులను కుదుట బరచుటకై ప్రభుత్వం వివిధ చర్యలు గైకొన్నది. జాగీరు గ్రామాల సర్వేమరియు సెటిల్మెంటు, బాపుల క్రింద సాగసు తరీ (బాగాత) భూముల విషయంలో రెమిషన్ మంజూరీ, 1359 ఫ (1949—50) కొరకు భూమి శిస్తు వసూలులో పన్నెండున్నర శాతం తగ్గింపు, పట్టా భూములలో బంచరాయి, ఫలవృక్షములను వేలం వేయడం, నజరానా మున్నగు రూపాలలో అక్రమ పన్నులను వసూలు చేయటంవంటి అవినీతికర మామూళ్ళను వెంటనే నిలిపివేయడం, జాగీరు రైతుల పట్టేదారీ హక్కులను రక్షించడం, జాగీరు అడవి ప్రాంతాలు మున్నగువాటి విషయంలో మాజీ జాగీర్దార్లు మంజూరుచేసిన కౌళ్ళను వెంటనే రద్దుపరచడం మున్నగు చర్యలు గైకొనబడినవి.

1950 సం.లో కమ్యుటేషన్ చెల్లింపులు ఆరంభమయ్యే పూర్వం జాగీర్లు రద్దు అయినతరువాత 1949 అక్టోబరు నుంచి 1950 మార్చి వరకు మొదటి 6 నెలలకొరకు రూ. 95.00 లక్షల మేరకు తాత్కాలిక అలవెన్సులు చెల్లించబడినవి.

కమ్యుటేషన్ క్రింద జాగీర్దార్లకు మాత్రమే చెల్లించవలసిన మొత్తం కల్దారు రూ. 15.50 లక్షలుంటుంది. ఇది కనిష్ఠపక్షం 10 సంవత్సరాలలోను గరిష్ఠపక్షం 20 సంవత్సరాల కాలంలోను చెల్లించబడాలి. ప్రస్తుతం సుమారు రూ. 95.00 లక్షల కమ్యుటేషన్ చెల్లించబడుతున్నది. ఇంతవరకు చెల్లించబడిన మొత్తం రూ. 522.09 లక్షలుంటుంది. కమ్యుటేషన్ పొందుతున్న జాగీర్దార్లు, హిస్సేదార్లు, గుజెరాదార్ల మొత్తం సంఖ్య 10000 వున్నది.

ఇంకనూ 200 జాగీర్ల విషయంలో చెల్లింపుల కొరకు జాగీర్దార్లు ముందుకురాలేదు.

1200 జాగీర్ల విషయంలో తాత్కాలిక కమ్యుటేషన్ తీర్పులు ఇవ్వబడినవి. మిగిలిన వాటివిషయమై తీర్పులు 1956—57 సం. లో ఇవ్వబడుతాయి. భోగట్టాసేకరణ పూర్తిఅయిన సందర్భాలలో అంతిమ తీర్పులు జారీచేయుటకు చర్యలు గైకొనబడుతున్నవి. వచ్చే సంవత్సరం అనేక కేసుల విషయంలో ఇట్టి అంతిమ తీర్పులు ఇవ్వబడగలవని ఆశింపబడుతున్నది.

ఇంతవరకు జాగీరు ఉద్యోగులు 8395 మందికి పింఛనులు మంజూరు చేయబడినవి.

*

# సామాజికాభివృద్ధి ప్రాజెక్టులు

1952 అక్టోబరు 2 వ తేదీన ఏడు సామాజికాభివృద్ధి బ్లాకులతో హైద్రాబాదు రాష్ట్రంలో ఒక మహత్తరమైన కృషి ప్రారంభమయింది. ఈనాడు రాష్ట్రంలోని 17 జిల్లాలలో పదిహేడు సామాజికాభివృద్ధి బ్లాకులు, పదిహేడు జాతీయ వికాస కేంద్రాలు ఉన్నవి. సామాజికాభివృద్ధి బ్లాకుకు జాతీయ వికాస కేంద్రానికి బడ్జెటు కేటాయింపులో మాత్రమే తేడావుంటుంది. సామాజికాభివృద్ధి బ్లాకుకు మూడేండ్లకు రూ. 45 లక్షలు ఇవ్వబడినాయి. జాతీయ వికాస కేంద్రానికి మూడేండ్లకు 8 న్నర లక్షలు ఇవ్వబడుతాయి. కాని ఈ రెండింటిలో జరిగే పని మాత్రం ఒకేతీరుగా వుంటుంది. భూములనుంచి హెచ్చుగా పంటలు పండించటం,



మెట్లకుంట జాతీయవికాసకేంద్రంలో పతాకారోహణ.



ములుగులో కమ్యూనిటీ రేడియోసెట్టును స్విచ్ వేసి ప్రారంభిస్తున్న శ్రీ చంద్రకాంతరావు గార్లు.

మంచినీటి సరఫరా, ఉత్తమమైన పారిశుధ్యం, గృహవసతి, భూములకు నీటి సౌకర్యాలు, రోడ్లు, చిన్నచిన్న వంతెనలు, పాఠశాలలు, ఆరోగ్య వైద్యసదుపాయాలు, పశువైద్యం, మార్కెటింగ్ సౌకర్యాలు, సాంఘిక విద్య, ఇవన్నీ సామూహికాభివృద్ధి కార్యక్రమంలో చేరివున్నవి.

ఈ కార్యక్రమాల నిర్వహణకొరకై సాధారణంగా పరిపాలనా సిబ్బందికి సంబంధించిన అధికారులు, ఉద్యోగులేకాక వ్యవసాయం, పల్లికువర్కుల్స్, పశువైద్యం ప్రజారోగ్యం, సహకారం, విద్యమున్నగు సాంకేతిక విషయాలకొరకై ప్రత్యేకోద్యోగులు నియమింపబడినారు. ఒక బ్లాకుడెవలప్మెంట్ అధికారి క్రింద 100 గ్రామాలుంటాయి. ఈ అధికారి మొదట హిమాయత్ సాగర్‌లో గాని లేక మరే ఇతర కేంద్రంలోగాని శిక్షణ పొందుతాడు. ప్రతి బ్లాకులో స్త్రీ పురుష సాంఘిక విద్యా ఆర్గనైజర్లు నియమింపబడుతారు. వీరు వయోజన విద్యా తరగతులు, జాతరలు, ప్రదర్శనలు, మహిళామండలులు, యువజన క్లబ్బులు, నాటకములు, జానపద గీతాలు, నృత్యాలు, పెద్దగ్రామాలలో గ్రంథాలయాలు మొదలగునవి పెట్టి గ్రామస్తు



మెట్లకుంటలో ఒకహాలుకు శంకుస్థాపన చేస్తున్న కేంద్రమంత్రి డా. కట్జూ.

లకు సాంఘిక విద్య గరపుతారు. ఈ ఆర్గనైజర్లకుకూడా మొదట శిక్షణ ఇవ్వబడు తుంది. పదేసి గ్రామాలకు ఒక గ్రామసేవకుడు ఉంటాడు. ఇతడు అనేక విషయాలలో గ్రామస్తులకు మార్గదర్శిగా వ్యవహరిస్తూ గ్రామసేవచేస్తూ ఉంటాడు. గ్రామసేవకులకు కూడా మొదట హిమాయత్‌సాగర్‌లో శిక్షణ ఇవ్వబడుతుంది.

హైద్రాబాదు రాష్ట్రంలోగల 34 అభివృద్ధి బ్లాకులు 4 వేల గ్రామాలకు, 30 లక్షల జనాభాకు వర్తించి ఉన్నవి. గత మూడున్నర ఏండ్లలో ఈ బ్లాకులపై రూ. 1 కోటి 37 లక్షల రూ. లు ఖర్చుపెట్టబడినవి. ఈ బ్లాకు ప్రాంతాలలోలేనట్టి స్థానిక అభివృద్ధి పనులపై మరి 95 లక్షలు ఖర్చుపెట్టబడినవి. సుశిక్షితులైన ఉద్యోగులు డబ్బు మున్నగు కొరతల కారణంచేత ఈ రాష్ట్రంలో సామాజికాభివృద్ధి బ్లాకులు, జాతీయ వికాస కేంద్రాలు ఒకే పర్యాయం ప్రారంభించడానికి వీలు లేకపోయింది. అందుచేత బ్లాకులు లేనట్టి ప్రాంతాలలోకూడా యావద్దేశంలో జరుగుతున్నట్టి అభివృద్ధికృషి కొంతవరకైనా జరిగేటట్టు చేయాలనే ఉద్దేశంతో స్థానికాభివృద్ధి పనులు ప్రారంభింపబడి ఆ ప్రాంతాల గ్రామాల అవసరాలుకూడా తీర్చబడుతున్నవి. ఈ పనులు ప్రభుత్వమిచ్చే ధనసహాయం, ప్రజలు ధనరూపంలోను, వస్తు



*మెట్లకుంటలో రోడ్డు నిర్మాణానికి డా. కట్జూ మార్గదర్శకత్వం వహించారు.*

రూపేణా చేసే సహాయంతోను జరుపబడుతున్నవి. గత మూడున్నర ఏండ్లలో ఖర్చు పెట్టబడిన రూ. 2 కోట్ల 32 లక్షలలో ప్రజలు రూ. 50 లక్షలకు పైగా సహాయపడ్డారు.

రాష్ట్రస్థాయి మొదలుకొని గ్రామస్థాయి వరకు అభివృద్ధికార్యక్రమాల వ్యవహారంలో ప్రజా ప్రతినిధుల సహకారం తీసుకోబడు తున్నది. గ్రామాలలో వికాసమండలులున్నవి. బ్లాకు అభివృద్ధి కమిటీలు, ప్రాజెక్టు అభివృద్ధి కమిటీలు, జిల్లా అభివృద్ధి కమిటీలు రాష్ట్ర అభివృద్ధి కౌన్సిలు ఏర్పడినవి. ఈ కమిటీలలో జాతినిర్మాణశాఖలకు చెందిన ప్రభుత్వ ప్రతినిధులు, అనధికార ప్రతి నిధులు సభ్యులుగా వున్నారు.

ఈవిధమైన కార్యకలాపాలపట్ల ప్రజలు కూడా తగు ఉత్సాహం చూపుతున్నారు. అందుచేతనే భారతప్రభుత్వ కమ్యూనిటీ ప్రాజెక్టు ఎడ్మినిస్ట్రేషన్ వారు హైద్రాబాదు రాష్ట్రానికి మరి 16 జాతీయ వికాస కేంద్రాలను కేటాయించారు. వీటి పని 1956 ఏప్రిల్ నెల నుంచి మొదలవుతుంది.



*వరంగలులో ఒకబావికి రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.*

ఇంతవరకు 35,000 ఎకరాల పడావా భూములు సాగుకు తేబడినవి. 33,615 ఎకరాలకు నీటి సదుపాయం కల్పించబడింది.

6 వేల ఎకరాలలో కూరగాయల చెట్లు ఫలవృక్షములు పెంచబడుతున్నవి. కొత్తగా 1200 బావులు త్రవ్వబడినవి. 10 వేల బావులు మరమ్మతు చేయబడినవి. కొత్తగా 577 పాఠశాలలు, 1000 వయోజన విద్యాకేంద్రాలు పెట్టబడినవి. 1000 ఎకరాలబంజరు భూములు అభివృద్ధి పరచబడినవి. గ్రామాలలో దాదాపు వెయ్యి ఇండ్లు నిర్మించ బడినవి. మరి 12 వేల పాత ఇండ్లు మరమ్మతు చేయబడినవి. 60 వేల ఎరువుగుంటలు



రాష్ట్రంలోని ఒక సామాజికాభివృద్ధి కేంద్రంలో దేశ్‌ముఖ్ దంపతులు.

త్రవ్వబడినవి. 500 మైళ్లనిడివి కొత్తరోడ్లు వేయబడినవి. అనేక వేల టన్నుల రసాయనిక ఎరువులు మేలురకం విత్తనాలు రైతులకు పంపిణీ చేయబడినవి. అయితే ప్రత్యేకంగా చెప్పదగిన విశేషమేమంటే ప్రజలే ఈ అభివృద్ధి కార్యక్రమాలన్నీ జరగాలని కోరుతూ వీటి నిర్వహణలో తమభాగం చెల్లిస్తామని ముందుకొస్తున్నారు.



# సాంఘిక సేవ

సాంఘిక సేవా శాఖ హరిజనులు, గిరిజనులు, నిమ్న జాతులు, వెనుకబడ్డ తరగతులు, పిల్లలు, అనాధులు, నిస్సహాయ స్త్రీలు మొదలగువారి సంక్షేమంకొరకు బహుముఖ కృషి చేస్తున్నది.

ఇంతవరకు ఈ శాఖ గిరిజనులకు శిక్షణ ఇచ్చి, వారిని సాంఘిక సేవాపాఠశాలల్లో నియమించుటకు నాల్గు ఉపాధ్యాయ శిక్షణ కేంద్రాలను నెలకొల్పింది. ఉపకారవేతనము లివ్వబడిన గిరిజన విద్యార్థుల కొరకు 158 ప్రాథమిక మరియు గ్రామపాఠశాలల స్థాపనకు మంజూరీ ఇవ్వబడింది. గిరిజన ప్రాంతాలలో మూడు హాస్టళ్ళు 25 వయోజనవిద్యాపాఠశాలలు నెలకొల్పబడినవి.

కొండజాతులవారికి సాంఘికశాఖ ఉచితంగా నాగళ్ళు, ఎద్దులు, విత్తనాలు ఇతర పనిముట్లను ఇచ్చి చాల సహాయపడుతున్నది. మహబూబునగరు జిల్లా మన్ననూరులో ఒక సహకార వ్యవసాయక్షేత్రం, ఆదిలాబాదు జిల్లాలో ఒక ప్రదర్శన వ్యవసాయక్షేత్రం నెలకొల్పబడినవి. ఇక్కడ గిరిజనులకు సహకార పద్ధతిన వ్యవసాయం చేయడం, ఆధునిక వ్యవసాయపద్ధతులు నేర్పించబడుతాయి. వివిధజిల్లాలలో ఈ సంవత్సరం వచ్చేసంవత్సరం గిరిజన ప్రాంతాలలో బావులు త్రవ్వించుటకు తలపెట్టబడింది.

కొండజాతుల మాజీనేరస్థులకు కూడా విద్యార్థి ఉపకారవేతనములు, ప్రత్యేక ప్రాథమిక మరియు గ్రామపాఠశాలలు, ఉపాధ్యాయుల శిక్షణ కేంద్రములు మున్నగువాటిద్వారా విద్యాసహాయం చేయబడుతున్నది. ఈ సంవత్సరం, వచ్చేసంవత్సరం గిరిజనుల మాజీనేరస్థులకు 200 గుడిసెలు కానీ లేక రెండుమూడు కాలనీలుగానీ నిర్మించుటకు యోజింపబడుతున్నది.

సాంఘిక సేవాశాఖ అస్పృశ్యత నిర్మూలనము కొరకు తీవ్రోద్యమం జరుపుతున్నది. హరిజనుల సాంఘిక, ఆర్థికాభివృద్ధికి నైతికోద్ధరణకు అనేక చర్యలు గైకొంటున్నది. 1951–52 సం. లో నాలుగు ఆరోగ్య యూనిట్లు, నాలుగు సహకార యూనిట్లు, రెండు వ్యవసాయ క్షేత్రములుగల ఒక హరిజన జాతికాలనీ నిర్మించబడినవి. అప్పటినుండి 414 క్రొత్తబావులు త్రవ్వించ బడినవి. 531 బావులు మరమ్మతు చేయబడినవి. హరిజనుల గృహనిర్మాణానికి 1,518 ఎకరాల 32 గుంటల భూమి స్వాధీనపరచుకోబడింది. విద్యార్థులకు పుస్తకాలు వగైరాలు సరఫరా చేయబడినవి. ఈ పనుల కొరకు రూ. 20,42,336 లు ఖర్చుపెట్ట బడినవి. ఈ సంవత్సరం ఇట్టి కార్యకలాపాలకొరకు రూ. 9,99,507 లు ఖర్చుపెట్ట బడుతున్నవి.

సాంఘిక సేవాశాఖ రెండు శిశు సంక్షేమ కేంద్రాలు క్రొత్తగా ఒక భిక్షుక గృహం తెరిచింది.

1953–54 సం. లో ఇతర వెనుకబడ్డ తరగతుల వారి సంక్షేమంకొరకై ఒక పథకం ఆరంభించబడింది. విద్యార్థులకు ఉపకార వేతనములు, పనివారలకు వృత్తి సహాయం, ప్రయివేటు హాస్టళ్ళకు గ్రాంటులు—రూపంలో వారికి సహాయం చేయబడుతున్నవి.

పిల్లల రక్షణ చట్టం నియమావళి ప్రకారం పర్వర్దా పిల్లలపట్ల అమానుష ప్రవర్తనను తుదముట్టించుటకు కృషిచేయ బడుతున్నది. ఈ శాఖ 1951 సం.లో పిల్లల సహాయ సంఘంచే తెరువబడిన కుట్టి వెల్లోడి పిల్లల గృహమును పర్యవేక్షిస్తున్నది. బాలనేరస్తులను రిమాండులో ఉంచుటకు 1954 మార్చి నెలలో ఒక ఆక్జిలియరీ గృహము తెరువబడింది. నారీసుధారసంఘం అను పేరుగల ఒక అనధికారసంఘం మహిళా శరణాలయాన్ని నడిపిస్తున్నది. దీనికి ప్రభుత్వం సాలీనా 12,000 గ్రాంటు ఇస్తున్నది.

నిమ్నజాతుల విద్యార్థి ఉపకార వేతన సంఘం నిమ్నజాతులకు చెందిన విద్యార్థుల అన్ని విద్యాదశలలో ఉపకారవేతనము లిస్తున్నది. 1954–55 సం. లో ఈ సంఘం విద్యార్థుల ఉపకార వేతనములు, ఇతర సహాయములకు రూ. 21,45, 081 లు ఖర్చుపెట్టింది. ప్రస్తుత సంవత్సరానికి రూ. 24 లక్షలు మంజూరు చేయబడినవి.



# విద్య

భారతప్రభుత్వం ఇస్తున్న ఆర్థిక సహాయంతోను, ఉత్సాహపూర్వకంగా ప్రజలు ఇస్తున్న సహకారంతోను రాష్ట్రంలోని విద్యావ్యాప్తి శీఘ్రగతిని పురోగమించుతున్నది. 75 శాతం జనాభాకు ప్రస్తుతం విద్యా సౌకర్యాలు లభిస్తున్నవి. నూటికి 80 మంది బాలురు, 30 శాతం బాలికలు పాఠశాలలకు పోతున్నారు. స్కూళ్ళకుపోవు బాలికల శాతాన్ని పెంచుటకు కృషిచేయబడుతున్నది.

ప్రస్తుతం రాష్ట్రంలో 12975 ప్రాథమిక పాఠశాలలున్నాయి. వీటిల్లో మొత్తం 8.50 లక్షలమంది పిల్లలు చదువుతున్నారు. 500 జనాభా, అంతకన్న ఎక్కువగల ప్రతిగ్రామంలో ఒక స్కూలువుంది. స్కూళ్ళకు పోవు పిల్లలసంఖ్య 33 శాతం పెంచుటకును, ద్వితీయ ప్రణాళిక కాలంలో 2500 ప్రాథమిక పాఠశాలలు తెరుచుటకును, తలపెట్టబడింది. అందువల్ల అదనంగా 1500 మంది ఉపాధ్యాయులను నియమించడం అవసర మవుతుంది. ఈ చర్యలఫలితంగా ప్రైమరీ స్కూళ్ళ సంఖ్య 6000 వరకు పెరుగగలదని ఆశింపబడుతున్నది. ప్రస్తుతం 200 జూనియర్ బేసిక్ స్కూళ్ళు వున్నవి. ద్వితీయ పంచవర్షప్రణాళికలో ప్రతిసంవత్సరం 100 ప్రాథమిక పాఠశాలలను బేసిక్‌స్కూళ్ళుగా మార్చుటకు తలపెట్టబడింది. ఏకోపాధ్యాయపాఠశాలలు ఎక్కువ ఉపయోగకరంగా ఉంటవని భావింపబడడంవల్ల ప్రస్తుతం ఉన్న 5300 ఏకోపాధ్యాయపాఠశాలలను సాలీనా 760 చొప్పున ఇద్దరు ఉపాధ్యాయులుగల పాఠశాలలుగా మార్చుటకు తలపెట్టబడింది.

నిర్బంధవిద్య ప్రవేశపెట్టబడిన ప్రాంతాన్ని విస్తృత పరచడం ప్రభుత్వ విధానమైనందువల్ల, నిర్బంధవిద్యాచట్టం క్రింద ప్రతిజిల్లాలో 10 గ్రామాలలో ఈ చట్టం అమల్లో పెట్టబడుతుంది. ఈ చట్టంక్రింద స్కూళ్ళు తెరువబడుతున్నవి.

ఇప్పుడు 680 లోయర్ సెకండరీ స్కూళ్ళు ఉన్నవి. ద్వితీయ ప్రణాళిక కాలంలో అదనంగా 120 స్కూళ్ళు తెరువబడు తాయి. ఈ స్కూళ్ళకు సాలీనా 200 మంది ఉపాధ్యాయులు నియమింపబడుతారు. లోయర్ సెకండరీ స్కూళ్ళలో 8000 మంది విద్యార్థులు చేరగలరని ఆశింపబడు తున్నది. సాలీనా 100 స్కూళ్లలో వృత్తి విద్య ప్రవేశపెట్టబడుతుంది. ఇప్పుడు 287 స్కూళ్ళలో హైయర్ సెకండరీ విద్య గరపబడుతున్నది. గత సంవత్సరం జూన్ నెలలో 19 ప్రభుత్వ మరియు ప్రయివేటు సంస్థలు బహూళార్థసాధక పాఠశాలలుగా మార్చబడినవి. ద్వితీయ ప్రణాళిక కాలంలో అదనంగా 18 స్కూళ్ళను బహూళార్థ సాధక పాఠశాలలుగా మార్చుటకు తలపెట్టబడింది. అందువల్ల హైయర్ సెకండరీ స్కూళ్ళలో అదనంగా 2000 మంది ఉపాధ్యాయులు నియమింప బడుతారని ఆశింపబడుతున్నది.

మిడిల్, మరియు ఇంటర్ మీడియెట్ ట్రెయినింగు రద్దుచేయబడింది. సెకండరీ విద్యా సంఘం చేసిన సిఫారసుల కనుగుణంగా రెండేండ్ల సెకండరీ ట్రెయినింగుకోర్సు ప్రవేశపెట్టబడింది. ఇప్పుడు 3 బి. ఎడ్. కాలేజీలు, 14 సెకండరీ గ్రేడు శిక్షణ కేంద్రాలు, 4 బేసిక్ శిక్షణ కేంద్రాలు వున్నవి. ఈ కేంద్రాలన్నిటిలో ఒక్కొక్కదానిలో అదనంగా 200 మందికి శిక్షణగరపుటకై సౌకర్యాలు కల్పించుటకు తలపెట్టబడింది. ప్రతిసంవత్సరం ఎక్కువగా 1000 మంది ఉపాధ్యాయులకు శిక్షణ ఇవ్వబడుతుంది. ప్రస్తుతంవున్న బి. ఎడ్ కాలేజీలలో సెకండరీ స్కూళ్ళనుంచి 400 మంది ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చుటకు పథకం వేయబడింది. ఫిజికల్ ఎడ్యుకేషన్ అకాడమీలో రెండేండ్ల శిక్షణకోర్సు ప్రవేశపెట్టబడుతుంది.

నిమ్నజాతి పిల్లల విద్యను ప్రోత్స హించుటకై ప్రత్యేక సౌకర్యాలు కల్పించబడినవి. ఇప్పుడు ఈ పిల్లలు మూడున్నర లక్షలమంది స్కూళ్ళలో చదువుతున్నారు. స్కూళ్ళలో చేరగోరు పిల్లలందరూ నిర్నిబద్ధంగా చేర్చుకోబడుతున్నారు. జిల్లా ప్రధాన కేంద్రాలయూ లన్నింటిలోను నగరాలలోను వారి కొరకు ఉచితంగా హాస్టళ్ళు నడిపించ బడుతున్నవి. పుస్తకాలు స్కూలు పరికరాలు మున్నగునవి కొనుక్కొనుటకు వారికి సహాయం ఇవ్వబడుతున్నది.

ప్రయివేటు ఏజెన్సీలు నడిపిస్తున్న స్కూళ్ళకు నెలకు రూ 2.25 లక్షల గ్రాంటు ఇవ్వబడుతున్నది.

ప్రాథమిక విద్యనుంచి హైయర్ సెకండరీ దశవరకు విద్యాబోధన మాతృభాషలోనే జరుగుతున్నది. పాఠశాలల గ్రంథాలయాలకు విద్యాశాఖ వివిధ ప్రాంతీయ భాషలలో 4 లక్షలకు పైగా పుస్తకాలు సరఫరా చేసింది.

బాలభవన్ అను పేరుగల పిల్లల గ్రంథాలయం ఒకటి నగరంలో నడిపించబడుతున్నది. సుమారు 2000 మంది బాలురు దీనిని ఉపయోగించుకొంటున్నారు. ఇట్టివే అనేక గ్రంథాలయాలు తెరువబడుతాయి.

సాంకేతిక విద్య

అభివృద్ధి కార్యక్రమాలు మున్ముందువాటి అవసరాలను ఆదుకోగలందులకై, సాంకేతిక శిక్షణ సౌకర్యాలను విస్తృత పరచాలి అన్న విధానాని కనుగుణంగానే రాష్ట్రంలో అందుకు తగుచర్యలు గైకొనబడుతున్నవి. నిజామాబాదు, నాందేడు, రాయచూరులలో బాలురపారిశ్రామిక పాఠశాలల స్థాయి పెంచబడింది. పర్భనీలోని వ్యవసాయపాఠశాల వ్యవసాయ ఉన్నతపాఠశాలగా పెంచబడింది. వరంగల్, ఔరంగాబాదు, గుల్బర్గాలలోని బాలికల పారిశ్రామిక పాఠశాలలు బాలికల వృత్తి విద్య ఉన్నత పాఠశాలల స్థాయికి పెంచబడినవి. ఈ స్కూళ్ళలో మిడిల్ తరువాత మూడేండ్ల హెచ్. యస్. సి. (డొమెస్టిక్ సైన్సు) కోర్సు ప్రవేశపెట్టబడింది. 1954-55 లో సాంకేతిక విద్యాభివృద్ధి పథకాలకై ప్రభుత్వం ఒక్కసారిగా లక్షరూపాయలు మంజూరుచేసింది. ప్రభుత్వ సాంకేతిక కళాశాలలో అనేక క్రొత్తపథకములు ప్రవేశపెట్టబడినవి. అందుకై భారతప్రభుత్వ సహాయంతో రూ 5.22 లక్షలు ఖర్చుకాగల డెవలప్మెంటు ప్రాజెక్టు అమల్లో పెట్టబడింది.

1954-55 సం.లో నగరంలో సెంట్రల్ క్రాఫ్ట్సు ఇన్‌స్టిట్యూట్ ఒకటి తెరువబడింది. ఇందులో 26 వ్యాపారాలలో యోగ్యత (ప్రొఫిషెన్సీ) సర్టిఫికెటు కొన్నింటిలో క్రాఫ్ట్సుమన్‌షిప్‌లో డిప్లొమా కోర్సులలో శిక్షణ యివ్వబడుతుంది.

రాష్ట్రప్రభుత్వ పబ్లిక్‌వర్క్సు, స్థానిక పరిపాలనాశాఖలలో వివిధ ఇంజనీరింగుశాఖలలో శిక్షణపొందిన సబ్-ఓవర్‌సీర్లు,

ముఖ్యంగా సివిల్ ఇంజనీరింగులో శిక్షణపొందిన సూపర్‌వైజరీ సిబ్బందికొరకును తీర్చుటకై మూడుప్రాంతీయ పోలీటెక్నిక్‌లు స్థాపించబడినవి. ఇవి వరంగల్, ఔరంగాబాదు, గుల్బర్గాలలో ఉన్నవి. వీటికి ఒక్కొక్క దానికి ఆవృత్త ఖర్చుక్రింద రూ. 0.86 లక్షలు మంజూరయినవి. ఈ విద్యాసంస్థలలో ఒక్కొక్కదానిలో మెట్రిక్ అనంతరం 3 ఏండ్ల డిప్లొమా కోర్సుల సివిల్ ఇంజనీరింగు విద్యార్థులు 40 మంది, సబ్-ఓవర్సీర్ విద్యార్థులు 40 మంది చేర్చుకోబడుటకు అవకాశముంది. అంతేగాక ఈ సంస్థలో రెండేళ్ల క్రాఫ్టుకోర్సులుకూడా కొన్ని ప్రవేశపెట్టబడినవి. కరీంనగరులోని వ్యవసాయ-వృత్తి పాఠశాల రద్దుచేయబడింది. దీనికి కేటాయింపబడిన డబ్బు నిజామాబాదు, నాందేడు, రాయచూరులలోని సాంకేతిక శిక్షణకేంద్రాలలో అదనంగా ఉత్పత్తివిభాగములను నెలకొల్పుటకు విభాగించబడింది. కరీంనగరులోని వ్యవసాయ - వృత్తిపాఠశాలలోని వెండిపనివిభాగం సెంట్రల్‌క్రాఫ్ట్సు ఇన్‌స్టిట్యూట్‌లోని బిద్రీ, నిర్మల్ పనివిభాగాలు ప్రభుత్వ లలితకళల విభాగాలకు మార్చబడినవి. ఈ కళాశాలలో క్రొత్తగా తెరువబడిన అప్లైడ్ ఆర్ట్ మరియు డిజైనుశాఖలో ఇవి ఒకభాగంగా ఉండుటకు పైచర్య గైకొనబడింది. 1955 అంతంనాటికి 19 సాంకేతిక సంస్థలలో మొత్తం 4016 మంది విద్యార్థులుండిరి.

## ఆర్షశాఖ

కేంద్రయాజమాన్యానికి 22 ముఖ్య చారిత్రక స్థూపములు 8 సంస్కృతిక ప్రదేశాలు మార్చబడినవి. రాష్ట్ర ఆర్షశాఖ సుమారు 600 శిల్పకళ చిహ్నములను పరిరక్షిస్తున్నది. ఈశాఖ టూరిస్టులకు తగు సౌకర్యాలు కలిగిస్తుంది. ఈ పురాతన చిహ్నముల విషయమై పరిశోధన చేస్తుంది. క్రొత్తగా ఉస్మానాబాదు జిల్లా తేర్‌లో చరిత్ర ప్రాశస్త్యంగల ప్రాంతం, బీదర్‌జిల్లా, ఉమ్మాపూర్‌లో రెండు పురాతన దేవాలయాలు హైద్రాబాదు నగరానికి దక్షిణాన 8 చరిత్రాత్పూర్వకమైన ప్రదేశాలు కనుగొనబడినవి.

## హైదరాబాదు మ్యూజియం

హైదరాబాదు మ్యూజియంలో ప్రదర్శించబడుతున్న వస్తువులను, తమప్రదర్శనములలో పెట్టుటకు ఎరువు ఇవ్వవలసిందని, సంస్కృతిక మరియు అకాడమిక్ సంస్థలు కోరుతున్నవి. రంగూన్‌లో జరిగిన ప్రద

ర్శనములో భారతదేశములో బౌద్ధకళను ప్రదర్శించుటకు భారతప్రభుత్వ ఆర్ష శాఖకు 12 అజంతా చిత్రవర్ణముల ప్రతులు ఎరువు ఇవ్వబడినవి. హంగరీ, చెకోస్లవేకియా, బల్గేరియాలలో కూడా భారత ప్రదర్శనము కొరకు ఈ ప్రతులు ఇవ్వబడినవి. జిల్లాల్లో స్థానిక ప్రజలలో మనజాతికి వారసత్వంగా లభించిన సంస్కృతిపట్ల శ్రద్ధాసక్తులు పెంపొందింపజేయుటకై అక్కడ ఈ మ్యూజియం ప్రబోధనాత్మకమైన ప్రదర్శనలను తరచుగా ఏర్పాటు చేస్తుంది.

నూమిస్మాటిక్ (నాణెముల) విభాగంలో ప్రతిసంవత్సరం క్రొత్తవస్తువులు చేర్చబడుతున్నవి. మ్యూజియంలో నాణెముల కేటలాగు తయారుచేసి దానిని ప్రచురించవలసి యున్నది.



# పబ్లికువర్క్సు

పంచవర్షప్రణాళిక కార్యక్రమాల కారణంగా పనిచురుకుగా సాగుతున్న శాఖలలో పబ్లికువర్క్సుశాఖ ఒకటి. రాష్ట్రంయొక్క పంచవర్షప్రణాళికలో 526 మైళ్ళపొడవురోడ్లు, వంతెనలు నిర్మించాలని తలపెట్టబడింది. కాని ప్రణాళికకాలం ముగిసేనాటికి 349 మైళ్ళ నిర్మాణం మాత్రమే పూర్తిఅవుతుంది. 1956 మార్చి నెలవరకు ప్రథమ ప్రణాళికపై రూ. 185 లక్షలు ఖర్చుపెట్టబడినట్లవుతుంది. అయితే ప్రథమ ప్రణాళిక కార్యక్రమం మొత్తానికి రూ. 248 లక్షల ఖర్చు తలపెట్టబడింది. ప్రణాళికలో చేర్చబడనట్టి రోడ్ల నిర్మాణంకూడా కలదు. అట్టిరోడ్లు రూ. 73.44 లక్షల ఖర్చుతో 161 మైళ్ళ పొడవున వేయబడుతున్నవి.



రామగుండం థర్మల్ స్టేషన్.



చిక్కడపల్లి పారిశ్రామిక కాలనీకి కేంద్రమంత్రి సర్దార్ స్వర్ణసింగ్ ప్రారంభోత్సవం చేశారు.

రోడ్లవిషయంలో మొత్తం భారతదేశపు సగటు విస్తృతితో పోల్చిచూచినట్లయితే హైద్రాబాదు రాష్ట్రంలో రోడ్ల విస్తృతి ఎక్కువగానే వుందని చెప్పాలి. అయితే నైసర్గిక పరిస్థితులనుబట్టి, రాష్ట్రి అవసరాలను బట్టి ఇంకా విస్తృతం చేయవలసి వున్నది. కరువు పనులక్రింద రూ. 3.4 కోట్లు ఖర్చు అయ్యే క్రొత్తరోడ్ల పనులు ప్రారంభింపబడినవి. అయితే కరువు పరిస్థితి కొంత మెరుగు కావడంవల్ల ఆ పనులు నిలుపబడినవి. ఇంతవరకు హెచ్చుగా ఖర్చుపెట్టబడినట్టి రోడ్ల పనికి ప్రాధాన్యమిస్తూ పైరోడ్ల నిర్మాణానికి ఒక కార్యక్రమం తయారుచేయబడింది. ఔరంగాబాదు, ఉస్మానాబాదు బీదరు, రాయచూరు జిల్లాల రోడ్ల పనిని పూర్తిచేయడం జరిగింది. ఈ రోడ్లు, వంతెనల సర్వేపనిని త్వరగా జరుపడానికై రెండేండ్లకొరకు రూ. 9.77 లక్షల ఖర్చుతో రెండు సర్వేడివిజనులు ఏర్పాటు చేయబడినవి. ఈ డివి జన్లు పనిచేయనారంభించినవి. మొదటి ఒకటిన్నర సంవత్సరాలకొరకు రూ. 6.50 లక్షల ఖర్చుతో అయిదు సబ్-డివిజన్లుగల ఒక హైవే సర్కిల్‌కూడా ఏర్పాటు చేయ బడింది. గతసంవత్సరంలో 10 క్రొత్తరోడ్ల నిర్మాణానికి పని ఆరంభింపబడింది.

ఆర్థికంగా ప్రాముఖ్యం గల అంతర్రాష్ట్రీయ రోడ్ల అభివృద్ధికొరకై భారతప్రభుత్వంయొక్క రూ. 100 లక్షల సహాయకగ్రాంటు కార్యక్రమంక్రింద గత సంవత్సరంలో రెండోరకపు కంకరరోడ్డు పనులు తొమ్మిది చేపట్ట బడినవి. జాతీయరహదారులలో 20 రోడ్లను అభివృద్ధిపరచడానికై అంచెనాలను తయారు చేసి భారత ప్రభుత్వంనుంచి మంజూరీ పొందబడింది. ఇది ప్రథమ ప్రణాళిక పనుల యొక్క మొత్తం రూ. 99.31 లక్షలనుంచి లభించింది. ఈ మొత్తంలోనుంచి రంగాపురంవద్ద కృష్ణానదిపై వంతెన నిర్మించడానికి ప్లానులు సిద్ధం చేయబడినవి.

ఇతర ప్రభుత్వశాఖల, ప్రజావసరాలకై ప్రతియేటా అనేక పెద్ద, చిన్న భవనాల పనులు కొనసాగించబడుతున్నవి. ఇటీవలనే చేపట్టబడిన భారీభవన నిర్మాణ కార్యక్రమాలలో ముఖ్యమైనవి ఇవి: రూ. 7.54 లక్షల ఖర్చుతో సికింద్రాబాదు కె. ఇ. యం. ఆసుపత్రి విస్తృతీకరణ; రూ. 3.96 లక్షల ఖర్చుతో నాందేడు సివిల్ ఆసుపత్రి నిర్మాణం; రూ. 2.46 లక్షల ఖర్చుతో కరీంనగరం సివిల్ ఆసుపత్రి నిర్మాణం; రూ. 0.78 లక్షల ఖర్చుతో ఆదిలాబాదులో క్రొత్తఆసుపత్రి; రూ. 10 లక్షల ఖర్చుతో హైదరాబాదులో నీలోఫర్ ఆసుపత్రిలో రేడియం ఇన్స్టిట్యూట్ స్థాపన; రూ. 5.62 లక్షల ఖర్చుతో వరంగల్‌లో సూతా ఆసుపత్రి. రాష్ట్రంలో వివిధభాగాలలో అనేక స్కూలు భవనముల నిర్మాణపు

పని ఆరంభించబడింది. హిమాయత్ సాగర్‌లో వ్యవసాయ భవనములు నిర్మించ బడుతున్నవి. హైదరాబాదులో రూ. 50 లక్షల ఖర్చుతో ఒక వైద్యకళాశాల నిర్మాణానికి ప్లానులు వేయబడినవి. రెండవ పంచవర్ష ప్రణాళికక్రింద రూ. 150 లక్షలఖర్చుతో సెంట్రల్ సెక్రటేరియట్, శాసనసభ భవనములు కూడా నిర్మించబడుతాయి.

రూ. 122.02 కోట్ల నాగార్జున సాగరు ప్రాజెక్టుపై ప్రాథమికపని ఇదివరకేపూర్తి అయింది. దీనివల్ల నల్లగొండ, ఖమ్మం జిల్లాల్లో 7.95 లక్షల ఎకరాల ప్రాంతానికి నీటివసతుల సౌకర్యం లభిస్తుంది. ఈ ప్రాజెక్టుక్రింద ఉత్పత్తియగు విద్యుత్తులో హైదరాబాదు భాగం 37,500 కి. వా. ఉంటుంది.

రాజోలిబండ డైవర్షన్ స్కీంవల్ల అవనంగా లక్ష ఎకరాల భూమి సాగుఅవుతుంది. దీనిక్రింద నీటివసతుల సౌకర్యం ఈ సంవత్సరంనుంచే కల్పించబడుతుంది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద 11 మధ్యరకం నీటివసతులప్రాజెక్టులు చేపట్టబడినవి. ఈ ప్రాజెక్టు లన్నింటికీ రూ. 460.80 లక్షలు ఖర్చుఅవుతుంది. వీటివల్ల 1.04 లక్షల ఎకరాలకు లాభం కలుగుతుంది. ఈ ప్రాజెక్టులలో బెండుసురా, కోయిలసాగరు, ఖాసాపూరు ప్రాజెక్టులు కూడా చేరి యున్నవి. ద్వితీయ ప్రణాళికక్రింద దేవనూరు హైడెల్ ప్రాజెక్టు, పూర్ణా నీటి వసతులు-జలవిద్యుచ్ఛక్తిప్రాజెక్టులు చేపట్టబడుతాయి. ఇందులో మొదటి ప్రాజెక్టుక్రింద సుమారు 50000 ఎకరాలు సాగుఅవుతాయి. ఇది 46000 కి.వా. జలవిద్యుచ్ఛక్తి సరఫరాచేస్తుంది. ఇరిగేషన్ మరియు నీటి సరఫరా కలుపుకొని వీటికి రూ. 790 లక్షలు ఖర్చు అవుతుం దని అంచెనా వేయబడింది. మరాట్వాడాలోని పర్భనీ జిల్లాలో పూర్ణాప్రాజెక్టు క్రింద 156540 ఎకరాలు సాగుఅవుతాయి. ఇది 8000 కి. వా. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేస్తుంది. దీనికి రూ. 705 లక్షలు ఖర్చు అవుతుంది. బహుళార్థసాధక గోదావరి ప్రాజెక్టు, ఎగువ కృష్ణా, భీమా, పెన్‌గంగా ప్రాజెక్టులు ద్వితీయ ప్రణాళికా కాలంలో చేపట్టబడుతాయి. ఈ ప్రాజెక్టులక్రింద అదనంగా 53 లక్షల ఎకరాలు సాగుఅవుతాయి. అంటే మొత్తం మీద ఇర్రిగేట్ చేయబడు ప్రాంతం 71.14 లక్షలుంటుంది. ఇట్టి ప్రాంతం మొత్తం సేద్యం చేయబడు ప్రాంతంలో 27 శాతం ఉంటుందన్నమాట. నిజాంసాగర్ జలవిద్యుచ్ఛక్తి స్టేషన్‌కు చెందిన మూడు యూనిట్లలో ఒకటి 1955 జనవరిలో ఉపయోగానికి తీసుకొని రాబడింది. మిగిలిన రెండు యూనిట్లు పూర్తిగా నెలకొల్పబడినవి. ఇవి, ప్రతిపాదించబడిన రామగుండం థర్మల్ పవర్ స్టేషన్—ఈ రెండు కలిసి నగరానికి ఎంతో

విద్యుచ్ఛక్తి సరఫరా చేయగలవు. తుంగభద్ర జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టులో సివిల్ పనులు చురుకుగా కొనసాగించబడు తున్నవి. గ్యాంట్రీ క్రేన్, ట్రాన్స్ఫార్మర్లు వగైరాలు నెలకొల్పబడినవి. ప్రస్తుతం ఆర్థిక సంవత్సరం అంతమయ్యేనాటికి పనిచేయుటకు సిద్ధంగా ఉంటాయి.

ఈ క్రింది 17 పట్టణములకు విద్యుచ్ఛక్తి సరఫరాచేయుటకు రూ. 17.50 ఖర్చుతో ఒక పథకం మంజూరు చేయబడింది. ఈ పథకానికి కేంద్రప్రభుత్వం అప్పుగా ఆర్థిక సహాయం ఇచ్చింది: ఓడు, ఉస్మానాబాదు, మెదకు, యెల్లందు, షోరాపూరు, బితాపూరు, భోనగిరి, జనగామ, నల్లగొండ, నిర్మల్, ఆదిలాబాదు, పర్లి, హింగోలి, గంగావతి, జాన్వాడా, లాతూరు. రెండవ ప్రణాళిక కాలంలో జిల్లా విద్యుచ్ఛక్తి శాఖ 108 పట్టణాలకు మరియు గ్రామాలకు రూ. 150 లక్షల ఖర్చుతో విద్యుచ్ఛక్తి సరఫరాచేయుటకు తలపెట్టింది.

## వాటర్ వర్క్స్

1909 సం.లో హైద్రాబాదు సికింద్రాబాదు జంటనగరాలలోని 4 లక్షల జనాభాకు త్రాగునీటి అవసరాలు తీర్చుటకై ప్రస్తుతపు హైద్రాబాదు నీటి సరఫరా పద్ధతి ఏర్పాటు చేయబడింది. కాని ఇప్పుడు జనాభా విపరీతంగా పెరిగిపోయింది. క్రొత్త స్థలాలలో నివాస గృహములు నిర్మించబడినవి. వాటికి రక్షిత నీటిసరఫరా అవసరం. దానిని దృష్టిలో పెట్టుకొని రీమోడలింగ్ పథకములు మంజూరు చేయబడినవి. నాలుగు భాగాలుగా కిస్తులరూపంలో ఈ పని ఆరంభించబడింది. రూ. 75 లక్షల ఖర్చుతో మూడుభాగాలపని పూర్తి అయింది. నాల్గవ భాగంలో పని ప్రగతి చెందుతున్నది. దీనికి రూ. 45.64 లక్షలు ఖర్చు కాగలవని అంచనా వేయబడింది. ఉస్మాన్‌సాగర్ నీటిసరఫరాను ఎక్కువ చేయుటకుగాను హిమాయత్ సాగర్ జలాశయంనుంచి మిగులునీటిని వినియోగించుటకు ఈపథకం తలపెడుతున్నది.

ఈ పథకం మరియు ఇకముందు చేపట్టబడు పథకములు పూర్తి కావడంతో తల 1 కి నీటిసరఫరా రోజు 1 కి ప్రస్తుతం ఉన్న 20 గ్యాలన్ల నుంచి 40 గ్యాలన్లవరకు ఎక్కువ కాగలదని ఆశింపబడుతున్నది. ఆరోగ్య

స్థాయిప్రకారం తల 1 కి కనీసం 40 గ్యాలన్ల నీరైనా రావాల్సివుంటుంది. ఈ పథకానికి రూ. 264.20 లక్షలు ఖర్చు అవుతుంది. ఇది 5 ఏండ్లలో పూర్తిచేయబడుతుంది.

అనేక సాంకేతిక సమస్యలగూర్చి నిర వధికంగా పరిశోధన జరుపబడుతున్నది. దానికి తోడుగా ఇంజనీరింగు పరిశోధనశాఖ అవసర సందర్భాలలో సిబ్బందికి శిక్షణ ఇవ్వడంలో సహాయపడుతున్నది. సాయిల్ మెకానిక్స్ విషయంలో గతసంవత్సరం పి. డబ్ల్యు. డి. చేత పంపబడిన సూపర్వైజర్లు శిక్షణ పొందినారు. వీరు ఇప్పుడు రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో నెలకొల్పబడిన ఫీల్డ్ సాయిల్స్ లేబొరేటరీలలో పనిచేస్తున్నారు.



# వైద్యం, ప్రజారోగ్యం

సాధ్యమైనంత తొందరగా వైద్య సదుపాయాలను విస్తృత పరచడమే ప్రభుత్వ ముఖ్యాశయం. ఇందుకొరకు అన్నివిధాలా కృషిజరుగుతున్నది. అనధికార సాంఘిక సంస్థల సహాయం, స్థానికప్రజల సహకారం కూడా ఇందునిమిత్తం స్వీకరింపబడుతున్నది.

వైద్యశాఖ అధీనంక్రిందవున్న ఆసుపత్రులలోనూ, చికిత్సాలయాలలోనూ ప్రజలకొరకు 5,696 మంచాలు వున్నవి. అంటే దాదాపు 3,000 మంది జనాభాకు ఒక మంచం చొప్పున అన్నమాట. పైశాఖ అధీనంలో 22 ఆసుపత్రులు 198 చికిత్సాలయాలు, 7 ప్రత్యేక సంస్థలున్నవి. తగినంతగా నిధులు లభ్యమైనచోట్ల లేక ప్రజా సహకారం లభించినచోట్ల క్రొత్త ఆసుపత్రులు నిర్మింపబడుతున్నవి. సంగారెడ్డిలోని క్రొత్త ఆసుపత్రిభవనం, వరంగల్‌లోని మహాత్మా గాంధీ ఆసుపత్రి, నగరంలోని రేడియో ఇన్‌స్టిట్యూట్ మరియు కేన్సర్ ఆసుపత్రి మొదలగునవి ఇటీవల నూతనంగా నిర్మింపబడినవి. ఖమ్మంలోని తాలూకా ఆసుపత్రి పై గ్రేడుకు పెంచబడినది. లక్ష రూపాయల వ్యయంతో ఉస్మానియా జనరల్ ఆసుపత్రి పునర్నిర్మించ బడనున్నది. సికింద్రాబాదులోని కె. ఇ. ఎం. ఆసుపత్రిలో విస్తరణ పనులు కొనసాగుతున్నవి.

క్షయవ్యాధి నిరోధక ఉద్యమం విస్తృతంగా వ్యాప్తిచెందింది. ప్రస్తుతం 2 శానిటోరియములు, ఒక ఆసుపత్రి, 4 క్లినిక్కులు పనిచేస్తున్నవి. వీటిలో 950 మందికి మంచాలవసతి వున్నది. ఇవిగాక క్షయరోగులకు వారి ఇండ్లలోనే చికిత్సచేసేపథకం జంటనగరాలలో సంతృప్తికరంగా అమలుపరచబడుతున్నది. ఈ పథకాన్ని 5 జిల్లాలలో ప్రవేశపెట్టడానికిగాను లక్షరూపాయలు మంజూరు చేయబడినవి.



జీడిమెట్ల గ్రామంలో ప్రసూతికేంద్రానికి నవాబ్ మెహదీ నవాజ్ జంగ్ ప్రారంభోత్సవం చేశారు.



నిలోఫర్ ఆసుపత్రి

ఉస్మానియా, కే. ఇ. ఎం. ఆసుపత్రులలో నర్సుల శిక్షణ ప్రైగ్రేడుకు హెచ్చించడమైనది. ప్రస్తుతంవున్న ఆసుపత్రులలోనూ, చికిత్సాలయాలలోను క్రొత్తగా ప్రసూతి వార్డులను తెరపడంద్వారాను, క్రొత్తప్రసూతి గృహాలను పెట్టడం ద్వారాను ప్రసూతి మంచములసంఖ్య పెంచబడింది. జిల్లామరియు తాలూకా పట్టణకేంద్రాలలో అధికంగా గ్రామీణ ఉపకేంద్రాలు తెరపబడుతున్నవి. మలేరియా, అంటువ్యాధులు, కుష్ఠు మొదలగు రోగముల నిరోధానికి ఉద్యమం విస్తృతంగా కొనసాగింపబడుతున్నది.

ఒక కుటుంబసంక్షేమ కేంద్రం, 17 కుటుంబపథకం కేంద్రాలు పనిచేస్తున్నవి. వీటిలో ప్రజలకు అవసరమైన సలహాలు ఉచితంగా ఇవ్వబడుతాయి. మెదక్‌జిల్లా పటన్‌చెరువులోనూ, ఔరంగాబాదు జిల్లా సిల్లోడ్‌లోనూ, బీదర్‌జిల్లా చిట్గోపలోనూ, కరీంనగరు జిల్లా జమ్మికుంటలోను నాలుగు వైద్య మరియు ఆరోగ్యయూనిట్లు పనిచేస్తున్నవి. ప్రతియూనిటు దానిచుట్టూ 6 నుంచి 7 మైళ్ళవరకుగల ప్రాంతంలో వుండే 25 నుంచి 30 గ్రామాలలోని దాదాపు 25,000 మంది జనాభాకు వైద్య సదుపాయాలు కల్పిస్తుంది.

1955 ఏప్రిల్ మాసంలో ప్రారంభింపబడిన కార్మికులకు ప్రభుత్వ భీమాపథకం క్రింద ఇన్స్యూర్ చేయించినట్టి దాదాపు 18 000 మంది ఫ్యాక్టరీ కార్మికులకు వైద్యసదుపాయాలు కలుగచేయబడుతున్నవి. ఎన్వయిర్న్‌మెంటల్ హైజీన్ బ్యూరోవారు చలనచిత్రాలు, రేడియో ప్రదర్శనలు, ఆరోగ్యవారాలను జరపడంవంటి పద్ధతులద్వారా ప్రజలలో ఆరోగ్యప్రచారాన్ని చేస్తున్నారు. ప్రాచ్య దేశాలకంతటికీ అపూర్వమైనదిగా ఎంచబడిన హైద్రాబాదు హెల్త్‌మ్యూజియం, క్రొత్త నమూనాలు ప్రదర్శనవస్తువులు మొదలగువాటిని చేర్చడంద్వారా విస్తృత పరచబడింది. నాందేడ్, బీదర్ పట్టణ కేంద్రాలలో చిన్న మ్యూజియములు నెలకొల్పబడినవి.

యూనానీ, ఆయుర్వేద విధాగాలలో 148 మంది రోగులకు మంచాలవసతి వున్నది. గత సంవత్సరం 30,041 మంది రోగులకు, 23,85,391 మంది ఔట్‌పేషంట్లకు ఈ భారతీయ ఔషధముల ఆసుపత్రులలో చికిత్సచేయడమైనది.





నర్సుల రాలీలో ప్రసంగిస్తున్న డా. యల్. డి. ఖత్రీ.

# స్థానిక పరిపాలన

స్థానిక పరిపాలనాశాఖ అధీనంక్రింద 2 మునిసిపల్ కార్పొరేషనులు, 38 నగర మునిసిపాలిటీలు, 120 పట్టణ మునిసిపాలిటీలు, 17 జిల్లాబోర్డులు, 1224 గ్రామపంచాయతీలు వున్నవి. ఇవిగాక హైదరాబాదు సిటీ ఇంప్రూవ్‌మెంట్ బోర్డు, సికింద్రాబాదు టౌన్ ఇంప్రూవ్‌మెంట్‌ట్రస్ట్, జిల్లా వాటర్ వర్క్స్ మొదలగు సంస్థలు కూడా ఈశాఖ అధీనంలో వున్నవి. రాష్ట్ర కేంద్రప్రభుత్వాల నుంచి లభ్యమయ్యే మొత్తాలనే సరిపుచ్చుతూ ప్రజలకు సౌకర్యాలను కల్పించడానికి ఈ శాఖ సాయశక్తులా కృషిచేస్తున్నది.

1928 వ సంవత్సరంలో తెరవబడిన జిల్లా వాటర్ వర్క్స్‌శాఖ, 1955, అక్టోబరు మాసాంతంవరకు 23 పట్టణాలలో నీటి సరఫరా మరియు డ్రైనేజీ సౌకర్యాలను కల్పించింది.

సిటీ ఇంప్రూవ్‌మెంట్ బోర్డు, పారిశుధ్యం, నివాసగృహముల నిర్వహణ మొదలగు తన సాధారణ కార్యక్రమంతోపాటు భారత ప్రభుత్వం తలపెట్టిన పారిశ్రామిక గృహపథకంక్రింద విస్తృతంగా కొనసాగుతున్న గృహనిర్మాణ పనులలోకూడా పాల్గొంటున్నది. ప్రస్తుతం ఈదోట్ట తక్కువ ఆదాయం గలవారికై ఇండ్లను నిర్మించే పథకాన్ని అమలుపరచడంలో నిమగ్నమై వున్నది. మొదటి పథకంక్రింద ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో 4,495 ఒక గది ఇండ్లు, 1,189 రెండుగదుల ఇండ్లు నిర్మింపబడినవి. ద్వితీయ ప్రణాళికా కాలంలో రూ. 5 కోట్ల వ్యయంతో 15,000 ఇండ్లను నిర్మించడానికి రాష్ట్రప్రభుత్వం యోచిస్తున్నది. ఈ నిర్మాణాలమూలంగా రాష్ట్రంలోని అత్యధికమైన కార్మిక జనాభాకు అన్ని ఆధునికమైన సౌకర్యాలతో నివాసవసతి కల్పింపబడగలదు.

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో మిగిలిన కాలంలో తక్కువ ఆదాయంగలవారికై ఇండ్లను నిర్మించే పథకం ప్రారంభించి, అందుకుగాను కోటిరూపాయిలను భారతప్రభుత్వం కేటాయించింది. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని హైదరాబాదు నగరంలో 500 ఇండ్లు, సికింద్రాబాదులో 200 ఇండ్లు, జిల్లాలలో 680 ఇండ్లు నిర్మింపబడుతున్నవి. ఇవిగాక మునిసిపల్ కార్పొరేషనుశాఖకు సిబ్బందికై ఇండ్లను నిర్మించడానికిగాను రూ. 16.80 లక్షల మొత్తం యివ్వడమైనది. భూమిని అభివృద్ధిపరచడానికీ, నివేశనస్థలాలను లాభం, నష్టంలేని ప్రాతిపదికపై ప్రజలకు విక్రయించడానికిగాను రూ. 5 లక్షలు కేటాయింపబడినవి. మరో రూ. 15.80 లక్షలు గృహనిర్మాణ సహకార సంస్థలకు అప్పుగా యిచ్చుటకు కేటాయించడమైనది. ద్వితీయ ప్రణాళికక్రింద రూ. 10 కోట్ల వ్యయంతో దాదాపు, 20,000 ఇండ్లను నిర్మించడానికి రాష్ట్రప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఈ రాష్ట్రానికి ఒక గృహనిర్మాణ బోర్డును ఏర్పాటు చేయడానికి ఉద్దేశింపబడింది.

1955, అక్టోబరు మాసాంతం వరకు బావులత్రవ్వకం శాఖ 7,009 బావులత్రవ్వకాన్ని పూర్తిచేస్తుంది. ఇంకా 167 బావులను త్రవ్వేపని కొనసాగుతున్నది. ప్రస్తుతం బావుల త్రవ్వకపుపని, బావుల త్రవ్వకం శాఖ, స్థానిక పరిపాలనాశాఖ, పబ్లిక్ వర్క్స్, సాంఘికసేవాశాఖ, గ్రామ పునర్నిర్మాణశాఖ మొదలగు వివిధశాఖల సూచనల ననుసరించి పనిచేసే ఒకే ఏజెన్సీ క్రింద జరగవలెనని ఉద్దేశింపబడింది.

గ్రామ పంచాయతీలకు విస్తృతమైన అధికారాలను ఇచ్చే ఒక క్రొత్త గ్రామపంచాయితీబిల్లు రూపొందింపబడింది. దీని మూలంగా గ్రామ పంచాయతీలు ప్రజాస్వామ్య సూత్రాలననుసరించి వ్యవహరించడానికి అవకాశం లభించగలదు.



# వాణిజ్యము - పరిశ్రమలు

రాష్ట్రంలో లఘుపరిశ్రమలను, గ్రామ పరిశ్రమలను, సంప్రదాయ సిద్ధంగా వస్తున్న చేతిపనులను ప్రోత్సహించడంలో పరిశ్రమలశాఖ విశేషంగా కృషిచేస్తున్నది. యుద్ధసమయంలో, భారీపరిశ్రమలతోపాటు వీనిలో కొన్ని పరిశ్రమలకుకూడా కొంత ప్రోత్సాహం లభించింది, కాని తర్వాత అవి నిస్సహాయస్థితిలో పడిపోయాయి. పరిశ్రమల అభివృద్ధికి వాణిజ్య, పరిశ్రమలశాఖ వివిధ విధాల సహాయపడింది. అవి గణింపదగిన ఫలితాలను ఇచ్చాయికూడా. సహకార కార్యకేంద్రాలను తెరచేపథకం, అగ్గిపెట్టెల కుటీర పరిశ్రమలఫ్యాక్టరీ, ఖాదీ మరియు గ్రామ పరిశ్రమల స్టాచూటరీబోర్డు, గ్రామీణ పరిశ్రమలపై విద్యుచ్ఛక్తితో యంత్రాలను నడపడానికి శిక్షణ, కుటీర మరియు లఘుపరిశ్రమలకు ఇతోధికంగా అప్పులను మంజూరు చేయడానికిగాను పరిశ్రమలకు ప్రభుత్వ సహాయపు ఆర్డినెన్సు మొదలయినవి ఈ రంగంలో జరిగిన కృషిలో ప్రత్యేకంగా చెప్పదగిన అంశములు.

కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాలలో 6 గ్రామపరిశ్రమల అభివృద్ధి కేంద్రాలలో, 13 గ్రామీణ కళలు, చేతిపనులు మరియు పరిశ్రమల కేంద్రాలలో శిక్షణ సౌకర్యాలు కల్పింపబడినవి. ఇవి చాలా సంతృప్తికరమైన ఫలితాల నిచ్చినవి. ఈ శిక్షణకేంద్రాలలో అత్యధిక సంఖ్యలో పనివాండ్లు చేరుతున్నారు. ముషీరాబాదులోగల గ్రామపరిశ్రమల శిక్షణ కేంద్రంలో అభ్యర్థుల సంఖ్య హెచ్చుగా వున్నది. దీనికి కారణం ఈ కేంద్రంలో టేకప్ మోషన్ ఎటాచ్‌మెంటు, తొక్కుడు మగ్గాలు, అంబర్ చర్ఖాలు మొదలగు అభివృద్ధికరమైన పరికరాలద్వారా శిక్షణ ఇవ్వబడటమే.

రాష్ట్రంలో ముఖ్య కుటీర పరిశ్రమ అయిన చేనేత పరిశ్రమ 27 అభివృద్ధిపథకాలను అమలుపరచడంద్వారా పునర్వ్యవస్థీకరించబడింది.

ఈ పరిశ్రమాభివృద్ధికి ఆర్థికసహాయం, త్రొక్కుడు మగ్గాలు, పికప్‌మోషన్ అటాచ్‌మెంట్, జాక్వార్డులు, ఇనుపరీల్లు మొద లగు అభివృద్ధికరమైన సాంకేతిక పద్ధతులు, విక్రయశాలలద్వారా మార్కెటింగ్ సౌక ర్యాలు కల్పించబడుతున్నవి. చేనేతపనివారి సహకారసంఘాలకు ఆర్థికసహాయంచేసిన ఫలితంగా చేనేత వస్త్రాల ఉత్పత్తి 1955 వ సంవత్సరంలో 216.99 లక్షల గజాల వరకు పెరిగింది. 1954 వ సంవత్సరంలో 79.55 లక్షల గజాల చేనేతవస్త్రం మాత్రమే ఉత్పత్తి అయింది. మార్కెటింగ్ సౌకర్యాలు కల్పించబడుతున్నందువల్లనూ రూపాయికి ఒకటిన్నర అణాల రిబేటు ఇవ్వబడినందువల్లను సహకార సంఘాలద్వారా విక్రయింపబడిన చేనేతవస్త్రాల అమ్మకం 1955 వ సంవత్సరంలో 205.37 లక్షల గజాలవరకు హెచ్చింది. 1954 వ సంవత్సరంలో 69.22 లక్షల గజాల చేనేతవస్త్రం మాత్రమే వీటిద్వారా అమ్ముడుపోయింది.

చేనేత పరిశ్రమాభివృద్ధికొరకు వచ్చే సంవత్స రానికై రూ. 63.46 లక్షలు వ్యయంకాగల పథకాలు వేయబడినవి. ఒక సహకార



*విజ్ఞానశాస్త్ర, పారిశ్రామిక కేంద్ర పరిశోధనాలయములు - విమానంలోనుంచి తీయబడిన ఛాయాచిత్రం.*

నూలు మిల్లు, వస్త్రాలను నునుపు, మరియు చలువ చేసే యంత్రం, ఉన్నియొక్క కార్డింగ్ ప్రాసెసింగ్ కేంద్రం మొదలగునవి నూతనంగా తెరవబడడానికి ఉద్దేశింపబడినవాటిలో కలవు.

భారత ప్రభుత్వనుంచి లభ్యమవుతున్న ఆర్థిక సహాయంతో బిదర్ సామాగ్రి, పైఠాన్ చెరగులు, సరిగెబుటా, హిమ్రూ, సలీంషాహీ, అప్పాషాహీ పాదరక్షలు, నిర్మల్ కొయ్యబొమ్మలు మొదలగు లఘు పరిశ్రమలు మరియు చేతిపనుల ప్రోత్సాహానికి అభివృద్ధికరమైన పథకాలు అమలుపరచబడుతున్నవి.

ప్రభుత్వంయొక్క కుటీరపరిశ్రమల విక్రయశాల రాష్ట్రంలోను, రాష్ట్రం వెలుపల కూడా వివిధ ప్రదర్శనలలో పాల్గొని సరకులను అమ్ముతున్నది.

పారిశ్రామిక సహకార సంస్థల ఫెడరేషన్, 20 సహకార కార్యకేంద్రాలు, చేనేతసహకార విక్రయశాలలు కూడా పై సరకుల అమ్మకానికి సౌకర్యాలు కలిపిస్తున్నవి. ఔరంగాబాదులో ఒక చేనేత విక్రయశాల తెరవబడింది. ఢిల్లీ, బొంబాయిలలో కూడ ఇటువంటివే 2 విక్రయశాలలు నెలకొల్పబడినవి.

ఖాదీమరియు గ్రామపరిశ్రమలను ప్రోత్సహించడానికై 6 అభివృద్ధి పథకాలను అమలుపరిచే నిమిత్తం భారత ప్రభుత్వం రూ. 1,32,515 ల వరకు గ్రాంటులను, ఋణాలను మంజూరు చేసింది. ఖాదీమరియు గ్రామపరిశ్రమల బోర్డుకు చట్టబద్ధమైన స్థాయి కల్పించబడినందున పై పథకాలను ఆ బోర్డు అమలు పరచగలదు. బెల్లం, కలకండ, దేశీకాగితం మొదలగు పరిశ్రమలు ఈవిధంగా అభివృద్ధిపరచబడగలవు.

కమ్మరి పరిశ్రమ, కత్తుల పరిశ్రమ, గాజుల పరిశ్రమ మొదలగు వాటికి కూడా కేంద్రప్రభుత్వ సహాయం లభించింది. మహబూబ్‌నగర్‌లో తెరవబడిన గాజుల పరిశ్రమ కేంద్రంలో ఇటీవలనే, గాజులను కోసే యంత్రం ఒకటి నెలకొల్పబడింది. ఈ యంత్రం 1/2 హార్స్‌పవర్‌గల ఎలక్ట్రిక్

మోటారుచే నడుపబడుతుంది. దీనివలన బంగారంపూతతో ముచ్చటైన గాజులను తయారుచేయడానికి వీలుంటుంది.

నిరుద్యోగ సమస్యను ఎదుర్కోడానికై సహకార కార్యకేంద్రాల పథకం రూపొందించబడింది. ఈ పథకానికి మొత్తం రూ. 5,06,390 లు ఖర్చు కాగలవు. దీనిలో భారత ప్రభుత్వం రూ. 2,84,950 లను గ్రాంటుగాను రూ. 1,50,000 లను ఋణంగాను మంజూరుచేసింది. మిగతా డబ్బును రాష్ట్రప్రభుత్వం ఇస్తున్నది. 20 కేంద్రాలలో 18 కేంద్రాలు రిజిష్టరుచేయబడి ఉత్పత్తి పనిని ఆరంభించినవి. ఈ కేంద్రములలో సిరా, బూట్‌పాలిష్, రేకు మరియు కొయ్య బొమ్మలు, ఉన్ని అల్లకపుపని, నూలు అల్లకపుపని, లోహసామగ్రి మొదలగునవి తయారుచేయబడుతున్నవి.

5 జాయింట్‌స్టాక్ కంపెనీలకు మేనేజింగ్ ఏజెంట్‌గా వ్యవహరిస్తున్న పారిశ్రామిక ట్రస్ట్‌ఫండ్ భారీ మరియు లఘు పరిశ్రమలకు ఋణాలను, సాంకేతిక శిక్షణను పొందెడి విద్యార్థులకు ఉపకార వేతనములను ఇస్తున్నది.

అనేకభారీపరిశ్రమల ఉత్పత్తిలో గమనించదగిన పెరుగుదల కనిపిస్తున్నది. రాష్ట్రంలో బొగ్గు ఉత్పత్తి, ప్రథమ పంచవర్ష ప్రణాళికలో కావాలనుకున్న 15 లక్షల టన్నులకు మించిజరిగినది. 1955 వ సంవత్సరాంతంవరకు 15,96,632 టన్నుల బొగ్గు ఉత్పత్తి అవడాన్ని బట్టి ఈవిషయం వ్యక్తమవుతున్నది. గత సంవత్సరంలో 2,73,794 టన్నుల సిమెంటు ఉత్పత్తిచేయబడగా ఈ సంవత్సరం 3,41,346 టన్నులు ఉత్పత్తి అయినది. నూలు వస్త్రాలు, పంచదార, కాగితం, మొదలగువాటి ఉత్పత్తికూడా ఈ విధంగానే పెరిగింది.

పారిశ్రామికపరిశోధనకు సంబంధించిన కేంద్ర ప్రయోగశాలలు, పరిశ్రమల అభివృద్ధికి అమూల్యమైన సలహాలద్వారాను ఇంకా ఇతర విధానాలద్వారాను సహాయపడుతున్నవి. ఇటీవల ఆముదం, బొగ్గు, ఇంధన తైలముల పరిశోధనలు జరిగినవి. వివిధరకముల దేశీకాగితము తయారుచేయబడి భారత ప్రభుత్వానికీ ఇంకా ఇతరులకు సరఫరా చేయబడుతున్నది. రాజస్థాన్‌నుంచి తేబడిన పుల్లర్స్‌ఎర్త్ ప్రయోగములు జరుపబడి మళ్ళీ రాజస్థాన్ ప్రభుత్వానికి పంపబడినవి.

# కార్మికశాఖ

యజమానులకు, కార్మికులకు మధ్య వివాదాలు వచ్చినపుడు, వారి సంబంధాలు బెడిసిపోకుండా సామరస్యంగా ఉంచుటకై కార్మికశాఖ కృషిచేస్తున్నది. కార్మికశాఖయొక్క ఈ విధానం కష్టనష్టాలకు గురియైన వ్యక్తులకు లాభదాయకంగా ఉంటుంది. ఇది అందరూ పరిగణించిన విషయమే. పోలీసు చర్యానంతరము ఇక్కడ ట్రేడ్ యూనియన్ ఉద్యమం చాలా ప్రబలిపోయింది. గత కొన్ని సంవత్సరాలనుంచి రిజిష్టరైన కార్మిక సంఘాల సంఖ్య చాలా పెరిగిపోతున్నది. ప్రస్తుతం 355 రిజిష్టరైన సంఘాలు పనిచేస్తున్నవి. ఆరంభంలో ఈ సంఘాలు కొంత వరకు అతి ఉత్సాహ ఉద్రేకాలు చూపినప్పటికీ, కార్మిక శాఖాధికారులతో విశేషంగా



*ఔరంగాబాదులో ఒక పారిశ్రామిక కాలనీ*



చిక్కడపల్లి పారిశ్రామిక గృహవసతి కాలనీ.

సంబంధాలు కలిగివుండడంవల్లను, ఈ అధికారులు కార్మికులపట్ల సానుభూతితో ప్రవర్తించడంవల్లను, వివాదాల పరిష్కారంలో రాజీపద్ధతులు అనుసరించుటకు కార్మిక నాయకులు తమ అంగీకారాన్ని తెలియబరుస్తున్నారు. గత సంవత్సరం 37 సమ్మెలు జరిగినవి. అయితే అవి ఏవీ చాలాకాలంవరకు కొనసాగలేదు. ఈ శాఖ కృషిఫలితంగా సమ్మెలు విరమింప జేయబడినవి.

ప్రజాప్రభుత్వం అమల్లో పెట్టిన దుకాణములు వ్యాపారసంస్థల చట్టంవల్ల, తక్కువ జీతాలు పొందు ఉద్యోగులకు లాభం చేకూరుతున్నది. వారు ఇప్పుడు గ్రాట్యుటీ, మున్నగు లాభాలు పొందగలుగుతున్నారు. అంతేగాకుండా ఈ చట్టంవల్ల ఖాస్గీ వ్యాపారసంస్థల పని నిర్వహణలో ఒక క్రమబద్ధమైన పద్ధతిని తీసికొని రాబడింది.

కార్మిక సహకార సంఘాలు స్థాపించడం, పారిశ్రామిక కార్మిక గృహనిర్మాణ పథకంక్రింద కార్మికులకు రెండుగదులుగల గృహములు నిర్మించుటకొనే పనిని వప్పగించడం—ఇవి రాష్ట్రంలో ప్రజాస్వామ్య ప్రభుత్వం ప్రవేశపెట్టిన మరొక మహత్తర పథకాలు. ఈ చర్యలఫలితంగా దళారీల ద్వారా కలుగు నష్టం తొలగించబడింది. అంతేగాకుండా కార్మికులలో బాధ్యతా భావమును పూరించుటకు ఇది సహాయపడింది.

కార్మిక శాసనమును అమలుపరచడంలో కార్మిక శాఖాధికారులు, అర్హమైన సందర్భములో కార్మికులకు తగినంత నష్టపరిహారం ఇప్పించుటకు తగు చర్యలు గైకొంటున్నారు. గత సంవత్సరం కార్మికులకు ప్రాణనష్టం కలిగిన 90 కేసులలో 68 మందికి, ప్రాణనష్టం కలగని 45 కేసులలో 40 మందికి నష్టపరిహారంక్రింద మొత్తం రూ. 1,17,527 లు చెల్లించబడినవి. కార్మికులకు వేతనాలు చెల్లించడంలో ఆలస్యం జరిగిన 60 కేసుల విషయంలోను వేతనాలు కోసివేయబడిన 16 కేసుల విషయంలోను తీర్పు ఇవ్వబడింది. వారికి వేతనాలక్రింద రూ. 13,588 లు, నష్టపరిహారంక్రింద రూ. 446 లు ఇవ్వబడినవి.

కార్మికశాఖ ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద రూ. 35 లక్షలు ఖర్చు అయ్యే ఒక పథకమును అమలు పరచుటకు తలపెట్టింది.



చిక్కడపల్లి పారిశ్రామిక గృహవసతి కాలనీకి రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## రీ సెటిల్మెంట్ అండ్ ఎంప్లాయ్‌మెంట్

హైద్రాబాదు సైన్యంనుంచి, కొన్ని ప్రభుత్వశాఖలనుంచి సిబ్బందిని చాలామందిని పనినుంచి తొలగించడంవల్ల వారిని రిజిష్టరు చేసుకోవడం ఎంప్లాయ్‌మెంటు ఎక్స్చేంజీల బాధ్యతలను ఇనుమడింపజేసినవి. అయితే అవి తమ శక్తికొలది ఉద్యోగ పరిస్థితిని ఎదుర్కొనుటకు తీవ్ర కృషిచేస్తున్నవి. ఉద్యోగావకాశాలు సమయంకొద్ది ఎచ్చుతగ్గులుగా ఉంటాయి. గత సంవత్సరం ఉద్యోగావకాశాలు ఎక్కువగా ఉండినవి. అనేక ఉద్యోగాలు ఖాళీ ఉన్నట్లు ఎక్స్చేంజీలకు తెలియపరచబడినవి. యథాప్రకారంగా ప్రభుత్వరంగం ఉద్యోగుల నియామకానికి ఆధారమైనప్పటికీ ప్రయివేటు రంగంలో కూడా కొంత అభివృద్ధి కనబడింది. అనేక పెద్ద సంస్థలు అంటే ప్రాగాటూల్సు, ఆల్విన్‌మెటల్ వర్క్సు, అజంతా సిగరెట్టు ఫ్యాక్టరీ, గ్లాస్‌పరిశ్రమలు తమకు కావలసిన ఉద్యోగ సిబ్బందిని ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీల ద్వారానే భర్తీచేసుకొనుటకు అంగీకరించినాయి. ఎక్స్ఛేంజీశాఖ అధికారులు రాష్ట్రంలో ఉన్న 5 పెద్ద పరిశ్రమల యజమానులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన ఫలితంగా వారు తమకు కావలసిన అప్రెన్‌టీసులను ప్రాంతీయ ఎక్స్ఛేంజీల ద్వారానే తీసుకొనుటకు అంగీకరించినారు. ప్రస్తుతం వివిధ కేంద్రాలలో 270 మంది వయోజన సివిలియన్ ట్రెయినీలుగాక మాజీసైనికులపై అధారపడిన 28 మంది కూడా వివిధ వృత్తులలో శిక్షణ పొందుతున్నారు. పి. డబ్ల్యు. డి. వర్కుషాపులో 14 మంది మాజీ సైనికులు రోడ్డు రోలర్ డ్రైవర్లుగా శిక్షణ పొందుతున్నారు.

ఈ ప్రాంతంలోవున్న కేంద్ర ప్రభుత్వ శాఖలు ఎక్స్ఛేంజీలకు గరిష్ఠ సహకారమిచ్చి చాలామంది అభ్యర్థులను ఉద్యోగాలలోకి తీసుకొంటున్నాయి. రాష్ట్ర ప్రభుత్వోద్యోగాలనుంచి రిట్రెంచి చేయబడిన ఉద్యోగులను తిరిగీ నియమించే కార్యక్రమం సంతృప్తికరంగా కొనసాగుతున్నది. గత సంవత్సరం వీరు 2093 మంది ప్రత్యామ్నాయ ఉద్యోగాలలో నియమింపబడినారు.

హైద్రాబాదు సైన్యాన్ని రద్దుచేసిన ఫలితంగా 35943 మంది సైనికులు తీసివేయబడినారు. వారిలో 28702 మంది ఎంప్లాయ్‌మెంటు ఎక్స్ఛేంజీలో రిజిష్టరు చేయించుకొన్నారు. వీరికి పునరావాసం కల్పించుటకు ప్రభుత్వం వివిధ పథకములను అమలుపరిచింది. ఈ పథకాలలోనే ఫతేనగరు, జవహర్ నగర్ (అమ్ముగూడ)లలోని సహకార వ్యవసాయ క్షేత్రాలు, కో-ఆపరేటివ్ బేకరీ సొసైటీ, సాంకేతిక శిక్షణ చేరియున్నవి.

## కార్మికులకు ప్రభుత్వ భీమాపథకం

కార్మికుల జీవిత భీమాపథకానికి యూనియన్ ప్రభుత్వ కార్మికశాఖామంత్రి 1955 ఏప్రిల్ 25 న ప్రారంభోత్సవం జరిపారు. హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలోను, చుట్టుప్రక్కలను ఇది 1955 మే 1 వ తేదీ నుంచి అమల్లో పెట్టబడింది. ఈ పథకం 18000 మంది ఫ్యాక్టరీ కార్మికులకు (వీరిలో 3000 మంది స్త్రీలుకూడా చేరియున్నారు.) వర్తింపు చేయబడింది. ఈ పథకంక్రింద జీవితం భీమాచేసిన కార్మికులకు ఈ క్రింద పేర్కొనబడిన సౌకర్యాలు కల్పించబడినవి :

1. వైద్య చికిత్స.

2. భీమాచేసిన వ్యక్తులకు రోగాలు జబ్బులు వచ్చినట్లయితే, వారికి అప్పుడప్పుడు ధనసహాయం చేయుట.

3. భీమాచేసిన స్త్రీకార్మికులకు గర్భిణులుగా ఉన్నప్పుడు, బాలింతలుగా ఉన్నప్పుడు ధనసహాయం చేయుట.

4. భీమాచేసిన కార్మికులు పనిచేయుచున్నప్పుడు గాయాల ఫలితంగా వికలాంగులైనట్లయితే వారికి అప్పుడప్పుడు ధనసహాయం చేయుట.

5. భీమాచేసిన కార్మికులు పనిచేయుచున్నప్పుడు ప్రమాద ఫలితంగా మరణించినట్లయితే వారిపై ఆధారపడినవారికి అప్పుడప్పుడు ధనసహాయం చేయుట.

కవాడిగూడా, సనత్‌నగర్, గోషామహల్‌లలోని మూడు భీమా ఆసుపత్రులలో ప్రస్తుతం కార్మికులకు వైద్యచికిత్సా సౌకర్యాలు కల్పించబడినవి. జంటనగరాలలో ఇతర స్థలాల్లో నివసిస్తున్న కార్మికులకు ప్రభుత్వ ఆసుపత్రులలో వైద్యసహాయం ఇవ్వబడుతున్నది. ఈ ఆసుపత్రులలో భీమాచేసిన కార్మికులకు ప్రత్యేక సౌకర్యాలు ఏర్పాటుచేయబడినవి.

## ఫ్యాక్టరీలు, బాయిలర్ల ఇన్‌స్పెక్టర్ కార్యాలయం

ఈ సంవత్సరం క్రొత్తగా 100 ఫ్యాక్టరీలు రిజిష్టరు చేయబడినవి. వీటికి 1948 సం. ఫ్యాక్టరీలచట్టపు 6 వ సెక్షన్ ప్రకారం లైసెన్సులు జారీచేయబడినవి. వీటితోపాటు ప్రస్తుతం రాష్ట్రంలో రిజిష్టరుచేయబడిన ఫ్యాక్టరీల సంఖ్య 1,155.

క్రొత్తగా ఫ్యాక్టరీలు నెలకొల్పుటకు, వాటిని విస్తృత పరచుటకు లేక ప్రస్తుతం ఉన్న ఫ్యాక్టరీలలో పాత యంత్రాలస్థానే క్రొత్తవాటిని అమర్చుటకు మొత్తం మీద 73 అనుమతులు ఇవ్వబడినాయి.

తీవ్రనేరాలకు లేక అలవాటుగా చేస్తున్న నేరాలకు 73 కేసులు ప్రాసెక్యూట్ చేయబడినవి.

1952 సం. హైద్రాబాదు ఫ్యాక్టరీల నియమావళిలో 72-73 నిబంధన క్రింద 4 క్యాంటీన్ల ప్లానులు ఆమోదించబడినవి.

ఈ సంవత్సరం 21 మినహాయింపు ఉత్తర్వులు జారీచేయబడినవి. ఈ ఉత్తర్వుల ఫలితంగా కొన్ని ఫ్యాక్టరీలలో రోజువారీ, వారవారం పనిచేయు వేళలకు భంగం వాటిల్లకుండా ఎక్కువ గంటలు పనిచేయుటకు సౌకర్యం కలిగించబడింది. ఇదే విధంగా 23 ఆర్. టి. డి. డిపోలకు 1956 డిసెంబర్ 31 వరకు మినహాయింపులు ఇవ్వబడినవి. ఈ మినహాయింపు ఫలితంగా ప్రజోపయోగకరమైన సర్వీసులరాకపోకల వేళల కనుగుణంగా షిప్టుల ఏర్పాటుకు సౌకర్యాలు కలిగించబడినవి.

చట్టపు సాధారణ పర్యవేక్షణ క్రిందికి ఇంతవరకు రాని చిన్నవ్యాపారసంస్థలకుకూడా ఫ్యాక్టరీలచట్టాన్ని వర్తింపజేయుటకు ఈశాఖ కృషిచేస్తున్నది. ఈ కృషిఫలితంగా చిన్నచిన్న సంస్థలలో నియమింపబడు ఉద్యోగులకు కొన్ని సౌకర్యాలు లభిస్తాయి. ఈశాఖ ఆదాయంకూడా ఎక్కువగా వుంటుంది.

ఇందుకొరకై ఇటీవలనే ఫ్యాక్టరీల జ్యూనియర్ ఇనస్పెక్టర్లు నల్గురు ప్రత్యేకంగా నియమింపబడినారు.

బాయిలర్ సెక్షన్

ఈ సంవత్సరం ఇండియన్ బాయిలర్ చట్టంక్రింద 46 బాయిలర్లు, 5 ఎకానమైజర్లు రిజిస్టరు చేయబడినవి. ఈ విధంగా మొత్తం 852 బాయిలర్లు రిజిస్టరు చేయబడినవి. రిజిస్టరు చేయబడిన 10 బాయిలర్లు ఇతర భారత రాష్ట్రాలనుంచి హైద్రాబాదుకు మార్చబడినవి. ఈశాఖయొక్క ఇతర అధికారులు 650 పర్యాయాలు బాయిలర్లను తనఖీచేశారు. వీటిలో 224 హైడ్రాలిక్సు రీత్యా పరీక్ష చేయబడినవి. 389 బాయిలర్లలోపలి పరికరాలు బయటిపరికరాలు పరిశీలింపబడినవి. 37 స్టీం పరిశీలనలు జరుపబడినవి.

ఫస్టుక్లాసు పరీక్షకు 25 మంది అభ్యర్థులు, రెండో తరగతి పరీక్షకు 101 మంది అభ్యర్థులు హాజరైనారు. వీరిలో ఫస్టుక్లాసు పరీక్షలో 6 మంది, రెండో తరగతి పరీక్షలో 55 మంది ఉత్తీర్ణులయినారు.



# పునరావాసం

హైదరాబాదు రాష్ట్రంలో పునరావాస సమస్య ఎప్పుడుగూడా పెద్ద చిక్కుగాలేదు. అయినా కాంగ్రెసు ప్రభుత్వం ఈ సమస్యను విజయవంతంగా పరిష్కరించి కాందిశీకులకు, నష్టకష్టాలకు గురియైన వివిధ కులాల ప్రజలకు సహాయం చేయగలిగింది. హిందూ ముస్లిం కాందిశీకులకు సహాయపడుటకై ప్రభుత్వం అమలుపరచిన పథకములు : (1) కుటీర పరిశ్రమలకేంద్రంలో నియమింపబడిన లేక శిక్షణ పొందిన వితంతువులు 4000 మందికి ఒక్కొక్కరికి రూ. 15 ల స్టైపెండు లివ్వబడినవి. (2) 2000 మంది విద్యార్థులకు ఒక్కొక్కరికి రూ. 3 నుంచి రూ. 10 ల వరకు ఉపకారవేతనము లివ్వబడినవి. పుస్తకములు వగైరాలు కొనుటకు వారికి రూ. 20 నుంచి 30 ల వరకు అడ్వాన్సు డబ్బు ఇవ్వబడినది. (3) 5000 మంది వితంతువులు లాభసాటి ఉద్యోగాలు సంపాదించుకోగలిగినంతవరకు జీవనోపాధికై వారికి రెండుమూడేండ్లవరకు నెల 1 కి రూ. 7 నుంచి 15 ల వరకు ఫించనులు ఇవ్వబడినాయి. (4) వివాహ సహాయపథకం క్రింద 400 మంది వితంతువులకు సహాయం ఇవ్వబడింది. (5) సుమారు 10000 మంది వ్యక్తులకు వారియిండ్లు లూటీ కావడమో లేక నాశనము కావడమో జరిగినందువల్ల ఉచితముగా వస్త్రములు ఇవ్వబడినవి. గృహముల నిర్మాణముకొరకై టిన్‌రేకులు, కలప మున్నగునవి సరఫరా చేయబడినవి. (6) అశక్తులైన వ్యక్తులు చాలామందికి ధన సహాయములు చేయబడినవి. (7) నష్టాలకు గురియైన కొంతమందికి సులభషరతులపై రాబట్టుకొనునట్లు తక్కావీ అప్పులివ్వబడినవి.

1952 సం.లో భారత ప్రధానమంత్రి బీదరు, ఉస్మానాబాదు జిల్లాలకు వచ్చిన తరువాత క్రొత్తగా ఒక అనధికారసంఘం ఏర్పాటు చేయబడింది. వితంతువులకు, బాలికలకు వివాహసహాయం ఇవ్వటం, అనాథలను అనువైన సంస్థలలో చేర్చడం, అవసరమయిన వ్యక్తులకు మడతరేకుల పంపిణీ చేయడం, మున్నగు రూపాలలో ఈ కమిటీ అనేకమందికి సహాయపడింది. ఒక కులం ప్రజలకు చెందిన ఆస్తిని మరొక కులానికి చెందిన ప్రజలు అన్యాయంగా ఆక్రమించుకొన్నట్లు వచ్చిన 400 కేసులు పరిష్కరించబడినవి.





# పరిపాలన

పరిపాలనలో లోపాలను తొలగించి, జాప్యములు జరుగకుండా సామర్థ్యాన్ని హెచ్చించడానికై పరిపాలనా శాఖ తగు జాగ్రత్త వహిస్తున్నది. అంతేగాక అవసరమైనప్పుడు కొత్తచర్యలను కూడా తీసుకుంటున్నది. గత కొన్నేండ్లలో వివిధశాఖలలో చాలా పునర్వ్యవస్థీకరణ జరిగింది. ఖర్చులో పొదుపు సాధించబడింది. అయితే రిట్రెంచిమెంటు, తొలగించబడిన ఉద్యోగులను తిరిగి చేర్చుకోవడం మొదలైన సమస్యలు ఎదుర్కొన్నవి. ఈ సమస్యల నెదుర్కొనడానికై నియమాలు తయారుచేయబడినవి. అవిసక్రమంగా పాటించబడాలని ఆదేశము లివ్వబడుతున్నవి. సరఫరా, ఎరోడ్రగ్గీ, తదితర శాఖలనుండి తొలగించబడిన ఉద్యోగులను సాధ్యమైనంతవరకు తిరిగి ఉద్యోగాలలో చేర్చుకోవడానికి సర్వప్రయత్నములు చేయబడుతున్నవి. ఇందుకొరకే సాంకేతికేతరమైన పదవులలో వున్నట్టి ఉద్యోగస్థులను రిటైరయ్యే సమయం వచ్చినప్పుడు —అంటే కొత్తపింఛను నియమావళిక్రింద 30 సంవత్సరాల సర్వీసుగలవారు, పాతపింఛను నియమావళిక్రింద 25 సంవత్సరాలు సర్వీసుగలవారు ఎట్టి కారణములు చూపబడకనే రిటైరు చేయబడవలెనని ప్రభుత్వం నిర్ణయించింది. 20 సంవత్సరాలు సర్వీసుగలవారి విషయంలో 50 స. ల వయస్సుకు చేరనివారిని రిటైరు చేయబడరాదని నిర్ణయింపబడింది.

ప్రభుత్వోద్యోగాల ఖాళీ వచ్చినప్పుడు వాటిని వెంటనే పబ్లిక్ సర్వీసు కమీషన్‌కు లేదా ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్‌ఛేంజికి లేదా జిల్లా సెలక్షన్‌కమిటీకి తెలుపవలెనని నిర్దేశించబడింది. 2 నెలలవరకు పూరింపబడకుండా వున్నట్టి ఖాళీలను అవి అవసరంలేదని భావింపబడి నట్లయితే వాటిని వదులుకోవలెనని లేదా పరిపాలనాశాఖయొక్క ఆమోదం పొందినమీదట వాటిని భర్తీచేయవలెనని ఆదేశింపబడింది. రిట్రెంచ్ చేయబడిన ఉద్యోగులు స్పష్టమైన ఖాళీలలో నియమించబడి నప్పుడు, వారిపని సంతృప్తికరంగా వున్నట్లయితే వారిని ఆ పదవులలో ఖాయపరచడ

మవుతుంది. సాంకేతి కేతరమైన పదవులకు సంబంధించిన కేసుల్లు, రిక్రూట్‌మెంట్ నియమావళిలో నిర్దేశించబడినట్లు రిక్రూట్‌మెంట్ షరతులు, ప్రమోషన్ కోటాలు పరిపాలనాశాఖ రిట్రెంచ్ చేయబడిన ఉద్యోగస్తులను తిరిగి తీసుకునే విషయమై జారీ చేసిన సర్క్యులర్లు అమలులో వున్నంతవరకు అల్లాగే నిలిపివుంచబడినవి. కరోడ్గిరీ శాఖ నుంచి రిట్రెంచ్ చేయబడిన ఉద్యోగులలో 20 ఏండ్ల సర్వీసు పూర్తిచేసిన వారికి 5 ఏండ్ల వెయిటేజ్ ఇచ్చి వారు పూర్తిపింఛను పొందే అవకాశాన్ని కల్పించడానికి, వారిని మళ్లీ ఉద్యోగాలలో చేర్చుకోకుండా, రిట్రెంచ్ చేయబడిన ఇతర ఉద్యోగులకు అవకాశం కల్పించడానికి నిర్ణయించబడింది.

కొన్ని ఉద్యోగాలను భర్తీచేసే విషయంలో పబ్లిక్ సర్వీసు కమీషన్, ఎంప్లాయిమెంట్ ఎక్చేంజ్, జిల్లా సెలక్షన్ కమిటీల ప్రసక్తి వుండదు. అటువంటి ఉద్యోగాల విషయంలో ఇతర విధముల అభ్యర్థులను పొందునప్పుడు వాటికి తగు అభ్యర్థులు లభింపగలరా లేదా అని పబ్లిక్ సర్వీసు కమీషన్‌ను లేదా ఎంప్లాయ్‌మెంట్ ఎక్చేంజీని లేదా జిల్లా సెలక్షన్ కమిటీలను విచారించవలెనని నిర్దేశింపబడినది. ఈ సంస్థల అధికార్లు ఏ అభ్యర్థినైనా సూచించినట్లయితే నియామకాధికారి అంతిమనిర్ణయాన్ని చేసేముందుగా ఆ సూచనను పరిశీలించవలసి వుంటుంది.

నేరుగా గెజెటెడ్ పదవులకు రిక్రూట్‌మెంట్ జరిపే సందర్భంలో వయస్సు గరిష్ఠపరిమితిని నిమ్నజాతులు, నిమ్నతెగలు మొదలగువారికి 5 ఏండ్ల సడలింపు యివ్వబడవలెనని ఉత్తర్వు చేయబడింది. ఇది ఆ తెగలవారికి ఇవ్వబడిన ప్రత్యేక రియాయతీ. నాన్‌గెజిటెడ్ పదవులకు రిక్రూట్‌మెంట్ చేసే విషయంలోకూడా పై రియాయితీ యివ్వబడుతున్నది.

ప్రభుత్వోద్యోగులలో అవినీతిని అరికట్టడానికై అవినీతి నిరోధకశాఖ నెలకొల్పబడింది. ఈ శాఖలోనే సి. ఐ. శాఖలో పూర్వంవున్నట్టి "ఎక్స్" బ్రాంచి విచారణ న్యాయస్థానంకూడా సంలీనం చేయబడినవి. 1955 ఆగస్టు 1 వ తేదీన రాష్ట్ర అవినీతినిరోధక కమిటీ ఏర్పాటు చేయబడింది. జిల్లాలలోకూడా ఇటువంటి కమిటీలు ఏర్పాటు చేయబడుతున్నవి.

అవినీతి నిరోధకశాఖకు శాసనబద్ధమైన అధికారాలివ్వడానికై ఒకబిల్లు తయారుచేయబడుతున్నది.

పరిపాలనా శాఖలో "వ్యవస్థ, పద్ధతులు" అను డివిజన్ ఒకటి ఏర్పాటు చేయబడింది. దీనికి ఒక సహాయ కార్యదర్శి అధిపతిగా వున్నారు. ఆయన సెక్రెటేరియేట్‌లోని వివిధశాఖలను సందర్శించి అక్కడ జరుగుతున్న పనుల పద్ధతిని పరిశీలించి లోపాలేమైనా వుంటే తగుసూచనలిస్తూ వుంటారు. ఇటువంటి తనిఖీ డైరెక్టర్ల కార్యాలయాలకు ఇతర ఆఫీసులకుకూడా ఏర్పాటుచేయబడుతుంది.

ఇప్పుడు రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ పని జరుగనున్నది కాబట్టి పరిపాలనా శాఖలో ప్రత్యేకంగా ఒక వ్యవస్థ ఏర్పాటు చేయబడింది. ఈ వ్యవస్థ ప్రాంతాలవారీగా ప్రభుత్వోద్యోగుల సంఖ్యకు సంబంధించిన ఫోగట్టాను, ఇతరవివరాలను తయారుచేసింది.



# ఆంతరంగిక వ్యవహారాలు

## పోలీసు

రాష్ట్రమంతటా పరిస్థితులు కుదుటపడిన తరువాత పోలీసుశాఖపై ఖర్చు తగ్గించబడుతూ వచ్చింది. అయినప్పటికీ, శాంతి భద్రతలు నెలకొల్పుటకై పోలీసు సేవను సమర్థవంతంగా చేయుటకు అది తగురీతిగా పునర్వ్యవస్థీకరించబడుతూ వచ్చింది. అందుకువలసిన పథకములుకూడా అమలుపరచ బడినాయి.

ఇతర రాష్ట్రాలనుంచి ఇక్కడికి వచ్చిన పోలీసు సిబ్బంది 1954 సం. నాటికి పూర్తిగా ఆయా రాష్ట్రాలకు పంపివేయబడింది. వారిస్థానే రాష్ట్ర కేడర్‌లో ఉండిన ఇండియన్ పోలీసు సర్వీసు అధికారులు నియమించ బడినారు. 1954—55 సం. లో పోలీసుశాఖపై రూ. 3,08,00,000 లు ఖర్చుపెట్ట బడ్డాయి. అయితే అంతకుముందు సంవత్సరంలో అయిన ఖర్చుకంటె ఇది రూ. 17 లక్షలు తక్కువ. తాత్కాలికంగా నెలకొల్పబడిన కొన్ని పోలీసుస్టేషన్లు, సబ్-డివిజన్లను రద్దుచేయడం ద్వారా మరికొంత ఖర్చు తగ్గించబడుతున్నది.

సౌజన్యవారాలు జరుపడంవల్లనూ, ఎన్నుకో బడిన గ్రామాలలో నిర్మాణాత్మక కృషిలో పాల్గొనడం వల్లను పోలీసు, ప్రజలతో సన్నిహిత సంబంధాలు కలిగివుంటూన్నది. బీదరు, గుల్బర్గా, బీడు, నల్గొండ జిల్లాల్లోని గ్రామీణ ప్రాంతాలలో పోలీసు శ్రమదాన కార్యకర్తలు గ్రామస్థుల సహకారంతో రోడ్లు, స్కూలు భవనాలు, త్రాగునీటి బావులు ఎరువుగుంటలు నిర్మించి కొన్ని గ్రామరోడ్లకు, బావులకు మరమ్మతు పనులను పూర్తిచేశారు. రాష్ట్రంలో శాంతిభద్రతల పరిస్థితి మొత్తంమీద మామూలుగా ఉన్నది. అయితే 1954 లో నిజామాబాదు, గుల్బర్గాలలో



అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనంలో ఏర్పాటుచేయబడిన సమాచారశాఖ పెవిలియన్‌లో
డా. యస్. రాధాకృష్ణన్.

కొన్ని అలజడులు జరిగినాయి. చక్కెరనగర్, బెల్లంపల్లి, రాగజ్‌నగర్, సనత్‌నగర్, మున్నగు చోట్లలో అప్పుడప్పుడు కార్మికులు కొంత ఆందోళనచేశారు. ఈ పరిస్థితులను పోలీసు సక్రమంగా అదుపులోకి తేగలిగింది. రాష్ట్ర భారతీయ శిక్షాస్మృతిక్రిందికి వచ్చు నేరములు తగ్గినాయి. ఈ శాఖ ఈ శిక్షాస్మృతియొక్క 108 మరియు 110 సెక్షన్ల ప్రకారం పహారాపద్ధతిని వ్యవస్థీకరింపడం, చెడు ప్రవర్తనగల వ్యక్తులను అరెస్టు చేయడం, క్రొత్తవ్యక్తులపై నిగాపుంచడం, భద్రతచర్యలు గైకొనడం మున్నగు నిరోధకచర్యలు గైకొన్నందువల్లనే, రాష్ట్రంలో నేరములసంఖ్య తగ్గింది.

కోర్టులలో నేరవిచారములు జరిపించుటకు 40 మంది పోలీసు ప్రాసెక్యూటింగ్ ఆఫీసర్లు, 107 మంది అసిస్టెంటు ఆఫీసర్లు నియమింపబడినారు. వారికి తగు శిక్షణ కూడా ఇవ్వబడుతున్నది.

వేలిముద్ర శాఖలో కొన్ని మార్పులు తేబడినాయి. అందులో ఫాన్స్‌ప్రింట్ సింగిల్‌డిజిట్ అనుపద్ధతి ఒకటి ప్రవేశపెట్టబడింది. ఈ పద్ధతివల్ల గజదొంగలను, నేరాలు చేయుటకు అలవాటుపడిన ఇతర వ్యక్తులను వేలిముద్రశాఖ రికార్డులపైకి తీసుకొనివచ్చుటకు ఈ శాఖకు సులభమవుతుంది. ఈ వేలిముద్రశాఖలో అత్యంత ఆధునికమైన పరికరాలున్నాయి. ఇందులో అల్ట్రావయొలెట్ ల్యాంప్ మరియు ఇతర పరికరములను కూడా చేర్చుటకు తలపెట్టబడింది.

రైల్వేపోలీసువారు గైకొన్న అనేక చర్యల ఫలితంగా రైల్వేలలోగూడా నేరములు చాల తక్కువైనాయి. అంతర్‌రాష్ట్ర గజదొంగలు, దొంగలముఠాలు స్థానిక ప్రాంతాలలో చెడుప్రవర్తనగల వ్యక్తులకు పోలీసు అంటే బెదురుగావున్నది.

సాయుధరిజర్వు పోలీసు దళాలకు సుశిక్షణ ఇవ్వబడింది. ఇవి శాంతి భద్రతలు నెలకొల్పడంలోను, జాతినిర్మాణ కార్యకలాపాలలోను ఎంతో ఉపకరించినాయి.

అవసరమైన ప్రజలకు సకాలంలో సహాయం చేయుటకై నగరంలో ప్రత్యేకంగా ఒక పోలీసు సమాచారకేంద్రం తెరువబడింది. నేరములను కనుగొని పట్టుకొనుటకై హైదరాబాదు నగరపోలీసుయొక్క



కమ్యూనిటీ రేడియో సెట్టువద్ద శ్రోతలు.

నేరశాఖలో శిక్షణపొందిన సిబ్బందిగల ఒక మోడస్ ఆపరాండిబ్యూరో తెరువబడింది. ఈ శాఖ నేరస్థులను పట్టుకోవడంలో ఎంతో సహాయపడుతున్నది. హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలో ఇంకనూ అనేక ట్రాఫిక్ ఐలెండ్స్, పాదచారులకు రోడ్డు దాటు స్థలాలు ఏర్పాటు చేయబడినాయి. నగరపోలీసు పునర్వ్యవస్థీకరణ పథకం 1955 జూలై 15 న అమల్లో పెట్టబడింది. ఈ పథకంప్రకారం నగరంలో శాంతి భద్రతల కొరకు, నేరములకొరకు ప్రత్యేకంగా వేరువేరు పోలీసు స్టేషన్లు నెలకొల్పబడినాయి. పౌరులకు రైఫిల్సు పట్టుకొని కాల్చడంలో శిక్షణ ఇచ్చుటకై జిల్లా ప్రధానకార్యాలయాలకు 22 రైఫిల్సు సరఫరా చేయబడినాయి.

జిల్లా పోలీసును పునర్వ్యవస్థీకరించి, వాటికి తిరిగి కొన్ని కేటాయింపులు చేయుటకు ప్రభుత్వానికి ఒక పథకం సమర్పించబడింది. జిల్లాల్లో ఎట్టి అత్యవసర పరిస్థితినైనా ఎదుర్కొనుటకు ప్రస్తుతంవున్న సాయుధ పోలీసుదళాలను పెంచాలని తలపెట్టబడింది. పోలీసు పరిపాలనా నిర్వహణలో ఒకే విధమైన పద్ధతిని అనుసరించుటకు రాష్ట్రమంతటికీ వర్తించునట్లుగా ఒక పోలీసు బిల్లు తయారు చేయబడింది. ఇప్పుడున్న నగర, జిల్లా చట్టాల స్థానే ఇది ప్రవేశపెట్టబడుతుంది.

## జైళ్ళు

హైదరాబాదు రాష్ట్రంలో జైళ్ళ నిర్వహణలో ఇటీవలనే అనేక సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి. బయటినుంచి వచ్చిన వారు వాటిని పరిశీలించి ప్రశంసించారు. ఖైదుచేయడమనేది కేవలం శిక్షమాత్రమేకాదు. శిక్షితులను సక్రమ మార్గంలోకి త్రిప్పుటకు ఒక సాధన. ఈ సూత్రమును పాటించడం వల్లనే జైళ్ళలో నిర్బంధింపబడిన వారిపట్ల ఇంకనూ ఉదారపూర్వకంగా ప్రవర్తించుటకును, వారికి ఉపయోగకరమైన శిక్షణ ఇచ్చుటకును చర్యలు గైకొనబడినాయి. ప్రభుత్వం ప్రతినెల ప్రతినేరస్థుడయిన వార్డర్‌కు రూ. 1, నేరస్థుడయిన ఓవర్‌సీర్‌కు 8 అణాలు, జైలులో రాత్రిపూట పహరా ఇచ్చునేరస్థునికి 4 అణాలు జీతం చెల్లించుటకు మంజూరు చేసింది. 1954 సం. హైదరాబాదు జైళ్ళ చట్టం అమల్లోకి వచ్చిన ఫలితంగా జైలు శిక్షల జాబితాలోనుంచి కొరడా దెబ్బలు, బండకొయ్యలు, శిక్షితులకు ఇవ్వబడు ఆహారం, గోనెదుస్తులు తొలగించబడినవి. కాయకష్టం చేయని ఖైదీలకు కాయధాన్యాల ఆహారం 8 చటాకులనుంచి 10 చటాకులకు పెంచబడింది. తెలంగాణా

ప్రాంతానికి చెందిన ఖైదీలకు బియ్యం రోజుకు రెండుపూటలు సరఫరా చేయబడు తున్నవి. వృత్తిపనులలో నైపుణ్యం గల ఖైదీలు సాంకేతిక వృత్తి విద్యాశాఖ జరుపు పరీక్షలకు కూర్చొనుటకు అనుమతి ఇవ్వబడుతారు. విడుదల అయిన తరువాత వారు ఉద్యోగం సంపాదించుకోగలందులకై వృత్తిపనుల యోగ్యతా పత్రములు ఇవ్వ బడుతాయి.

ఖైదీలలాభంకొరకై పరిశీలన క్రిందఉన్న క్రొత్త పథకములు : సామాజిక ప్రాజెక్టులలో నేరస్థులకు ఉద్యోగం, సాయుధ పోలీసు గార్డ్సుస్థానే సాయుధజైలుగార్డ్సును నియమించుట; నేరాలకు అలవాటుపడిన వ్యక్తులకు పారిశ్రామిక, వ్యవసాయ కాలనీలలో పునరావాసం కల్పించుట; రాష్ట్రంలో బోర్ట్సాల్ స్కూలును స్థాపించుటకు హైద్రాబాదు బోర్ట్సాల్ స్కూలు చట్టమును ప్రవేశపెట్టుట; నూలు వడుకడం, యేకడం పనులలో ఖైదీలకు శిక్షణ ; జైలు గ్రంథాలయాలస్థాపన; జిల్లా జైళ్ళన్నింటిలో రేడియో సెట్టుల ఏర్పాటు; పండుగ దినాలలో ఖైదీలకు ప్రత్యేక ఆహారం ఇచ్చుట; బొంబాయిలోని టాటా ఇన్స్టిట్యూట్‌లో సాంఘిక విజ్ఞానశాస్త్రము లలో శిక్షణపొందుటకు జైలర్లను, డిప్యూటీ జైలర్లను పంపుట.

### న్యా య శా ఖ

ఖమ్మం ఒక క్రొత్తజిల్లాగా ఏర్పాటు చేయబడడంతో అక్కడ 1955 జూన్ 1 నుంచి జిల్లా మరియు సెషన్స్ జడ్జికోర్టు, జిల్లా మేజిస్ట్రేటు, సబ్ జడ్జికోర్టులు స్థాపించబడినవి. కొన్ని జిల్లాల్లో పని ఎక్కువగా పెరిగినందువల్ల 1955 మార్చి 1 నుంచి మూడు అడిషనల్ డిస్ట్రిక్ట్ అండ్ సెషన్స్ జడ్జీలపదవులు మంజూరు చేయబడినవి.

ప్రధాన న్యాయమూర్తికి ఆర్థికాధికారాలు సంక్రమింపజేయు విషయం ప్రభుత్వం పరిశీలిస్తున్నది. కోర్టులకు ఎక్కు ప్రజలకు సౌకర్యం కల్పించేందుకై బీదరు, లాతూరులలోని మున్సిఫ్‌కోర్టుల ధన సంబంధమైన అధికారాలు రూ. 2000 ల నుంచి రూ. 5000 ల వరకు పెంచబడినాయి.

ప్రధానన్యాయమూర్తి రాష్ట్రంలోని వివిధ కోర్టులను తరచుగా తనఖీ చేస్తున్నారు. తత్ఫలితంగా తీర్పులస్థాయిని పెంచడానికి,

నేర వ్యవహారాలను త్వరగా పరిష్కరించడానికి, స్వల్పకాలానికి శైక్ష విధింపబడిన నేరస్థులకు అదేరోజున తీర్పు ప్రతులను సరఫరాచేయడానికి, ఎక్జిక్యూటివ్ పిటీషన్లకు ప్రాధాన్యం ఇవ్వడానికి, కేసులను పరిష్కరించడంలో ఆలస్యం జరుగకుండా చేయడానికి ఉత్తర్వులు జారీచేయబడినవి. ఇవి సబార్డినేటు కోర్టులకు మార్గదర్శకంగా ఉంటాయి.

సబార్డినేటు కోర్టుల అనుసరణకు సంబంధించిన నియమావళి, సివిల్ ప్రొసీజర్ కోడ్ క్రింద నియమావళి రూపొందింపబడినాయి. వీటికి ప్రభుత్వామోదం లభింపవలసియున్నది.

## ఎన్నికలు

హోంశాఖయొక్క ఉపకార్యదర్శి అధికార రీత్యా చీఫ్ ఎలెక్టోరల్ ఆఫీసరుగా ఉంటారు. ఓట్లను నమోదుచేయడం, రాష్ట్ర శాసన సభకు, లోకసభకు, ఎన్నికలు జరిపింపడం ఆయన ముఖ్యవిధులు. రాష్ట్రంలోని 142 అసెంబ్లీ నియోజకవర్గాలకు ఓటర్ల జాబితాలు ప్రతిసంవత్సరం సరిచూడబడుతాయి. ఆ తరువాతనే అవి ప్రజల సమాచారం కొరకై అంతిమంగా ప్రచురించబడుతాయి.

ఎన్నికల సంఘంయొక్క సూచనల ఫలితంగా 1954 సం. లో ఓటర్ల జాబితాలు క్షుణ్ణంగా సరిచూడబడినాయి. ఎన్నికలు జరుపుటకుగాను వివిధ దశలలో నిర్వహించవలసిన పనులనుగూర్చి కార్యక్రమం తయారుచేయబడింది. అంటే ఓటర్లసంఖ్య, జాబితాల తయారీ, ఓటర్ల జాబితాల ముసాయిదా ప్రచురణ, హక్కులు, ఆక్షేపణలను పరిశీలించి, పరిష్కరించుట, సవరణ చేయబడిన జాబితాలను అచ్చువేయించి వాటిని పంచిపెట్టుట, ఆతరువాత వాటిని అంతిమంగా ప్రచురించుట ఈ పనులకై కార్యక్రమం తయారుచేయబడింది. రాష్ట్ర నియోజకవర్గాలన్నింటిలో 1955 అక్టోబరు 25 న జాబితాల ప్రాథమిక ప్రచురణ జరిగింది. రివైజింగు అధికారుల పరిశీలనల కనుగుణంగా చేర్పివేతలు, కొట్టివేతలు, దిద్దుబాట్లు చేయబడుతున్నవి.

క్రొత్త నియోజకవర్గాల విభజన ఆధారంగా 1956—57 సం. లో జాబితాలు సరిచూడబడుతాయి.

నియోజకవర్గాలన్నింటికిని ముఖ్యమైన జాబితాల ముద్రణ పూర్తిఅయింది. 1955 సం. నకు అనుబంధ జాబితాలు వగైరాలు ఈ సంవత్సరం అచ్చువేయబడుతాయి.

క్రొత్తగా విభజింపబడిన నియోజకవర్గాలక్రింద ఉండు పోలింగు స్టేషన్ల జాబితాలు 1956 మార్చి ఆఖరునాటికి సిద్ధంగా ఉంటాయి. నియోజకవర్గాల చిత్రపటములు 1956—57 లో ప్రచురించబడుతాయి.

స్యాక్టరీలోని వైజ్ఞానిక పరిశోధనా సంఘము నుంచి త్రుప్పు పట్టకుండా ఉంచుటకు తయారుచేయబడిన ద్రావకం జిల్లా అధికారులకు సరఫరా చేయబడింది. ఈ ద్రావకం ద్యాలెట్ పెట్టెలకు పూస్తారు. ఉపయోగానికి రాని పెట్టెలు ఈ సంవత్సరంలో మరమ్మతు చేయబడి, యథాస్థితికి తీసుకొని రాబడుతాయి.

## సమాచార పౌరసంబంధములు

ప్రభుత్వ కార్యకలాపాలన్నింటికి ప్రచారమివ్వడం, పత్రికాభిప్రాయాలను ప్రభుత్వానికి తెలియబరచడం సమాచార పౌరసంబంధముల శాఖ ముఖ్యవిధులు. అందుకై ఈ శాఖ పత్రిక, రేడియో, ఫిల్ము నాటక ప్రదర్శనములు మున్నగు ప్రచారక సాధనములను వినియోగించుచున్నది.

ఈ శాఖ ప్రతిరోజు ఇంగ్లీషు, ఉరుదు, మరియు ప్రాంతీయభాషలలో పత్రికా ప్రకటనలను జారీచేస్తుంది. "నేటి హైద్రాబాదు" అను మాసపత్రికను ఐదు భాషలలో ప్రచురించుచున్నది. వివిధశాఖల కార్యకలాపాలను గూర్చి అనేక పుస్తకములు, కరపత్రములు జారీ చేయబడినవి. ప్రభుత్వ క్రొత్త విధానాలనుగూర్చి పోస్టర్లు, సినిమా స్లయిడ్సు మున్నగువాటి ద్వారా ప్రచారం కొనసాగించబడుతుంది, అంతేగాకుండా రాష్ట్ర ప్రభుత్వ ఋణములు, భూసంస్కరణలు, హాలీ కరెన్సీరద్దు మున్నగు వాటికి గూడా ప్రచారమివ్వబడింది. ఈ శాఖ తరచుగా పత్రికా సమావేశములు ఏర్పాటుచేస్తుంది. అంతేగాక ప్రభుత్వ ముఖ్య కార్యకలాపాలను గూర్చి పత్రికలలో ప్రచురించబడు వార్తలను పరిశీలిస్తుంది కూడా. అవసరమైనపుడు అసత్య వార్తలను ఖండిస్తూ పత్రికా ప్రకటనలు జారీచేస్తుంది.

రాష్ట్రంలో పత్రికాభిప్రాయాలను గూర్చి ప్రతిరోజు నివేదికలు తయారుచేయబడి రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలకు పంపబడుతాయి. పత్రికలలో ప్రకటించబడు కొన్నివార్తలు సంబంధించిన మంత్రులకు, ప్రభుత్వ కార్యదర్శులకు, శాఖాధిపతులకు పంపబడుతాయి. ఈ శాఖలో ఒక గ్రంథాలయముంది. పాత్రికేయులు దీనిని ఉచితంగా వాడుకోవచ్చును.

ఈ శాఖ ప్రభుత్వ ప్రకటనలకు పత్రికలను ఎన్నుకొనుట, బుకింగ్‌స్థలము, బిల్లుల పరిశీలన మున్నగు విధులు నిర్వహిస్తుంది.

ఈ శాఖయొక్క ప్రచురణల విభాగం రాష్ట్ర ప్రభుత్వ ప్రచురణలను నిర్వహించి వాటిని విక్రయించుటకు ఏర్పాటుచేయడమే గాక కేంద్ర ప్రభుత్వ ప్రచురణలకు ఏజెంటుగా కూడా పనిచేస్తున్నది. నగరంలోను, జిల్లాలలోను పంచవర్షప్రణాళిక చేనేతపరిశ్రమ మున్నగువాటికి సంబంధించిన సాహిత్యమును తయారుచేయుటకును, దానిని ప్రచారంలోకి తెచ్చుటకును భారత ప్రభుత్వ అడ్వర్టయిజింగ్ విజువల్ పబ్లిసిటీ డైరెక్టరేట్‌తోకూడా సహకరిస్తున్నది.

ఈశాఖయొక్క రూరల్ బ్రాడ్కాస్టింగ్ సెక్షన్ రాష్ట్రంలో వివిధభాగాలలో కమ్యూనిటీ రేడియో సెట్టులను నెలకొల్పింది. ఇంతవరకు 107 సెట్లు నెలకొల్పబడినాయి. 1956–57 లో 200 ల సెట్టులను నెలకొల్పుటకు తలపెట్టబడింది. రెండవ ప్రణాళికాకాలంలో 2000 సెట్టులను స్థాపించుటకు పథకం తయారుచేయబడింది.

విదేశీ యాత్రికులకు అవసరమైన సమాచారము మున్నగు వాటిని తెలుపుటకు ఒక టూరిస్టు ఇన్ఫర్మేషన్ ఆఫీసరు నియమింపబడినాడు.

ఈశాఖయొక్క మాస్ కమ్యూనికేషన్ డివిజన్ ఒక స్పెషల్ ఆఫీసర్ పర్యవేక్షణ క్రింద పని చేస్తున్నది. రాష్ట్రంలో పంచవర్ష ప్రణాళికా ప్రగతిని విపులంగా సమీక్షిస్తూ "శ్రేయోరాజ్యపథంలో" అనే పేరుతో ఒక పుస్తకమును ఈమాస్‌కమ్యూనికేషన్ డివిజన్ ప్రచురించింది. ఇంకనూ అనేక ప్రచురణలు తయారీలో ఉన్నవి. ఇందులోని ఫొటోగ్రాఫిక్ సెక్షన్ రాష్ట్రంలో జరుగు

ముఖ్య విశేషముల ఫోటోలు తీసి పత్రికలకు "నేటి హైద్రాబాదు"కు, ప్రముఖ వ్యక్తులకు, మరియు తదితరులకు సరఫరా చేస్తుంది. ప్రాముఖ్యంగల వివిధ విశేషాలను చలన చిత్రములుగా తీసినది. ఈ ఫిల్ములు గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో సంచారక సినిమావ్యాన్‌ద్వారా ప్రదర్శించబడుతాయి.

ఒక సంచారక ప్రదర్శనము కూడా వ్యవస్థీకరించబడింది. అనేక స్థలాలలో అప్పుడప్పుడు ప్రదర్శనశాలలు తెరువబడినవి. ఇప్పుడు ఈ మాస్ కమ్యూనికేషన్ డివిజన్ ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు ప్రచారమిచ్చు కార్యక్రమమునకు పూనుకొన్నది.

ఈ డివిజన్‌లో సౌండ్ అండ్ డ్రామా సెక్షన్ ప్రాంతీయభాష లన్నింటిలో నాటికలు, పాటల పోటీని ఏర్పాటుచేసింది. బహుమతి పొందినవి భారత దేశమంతటా ప్రదర్శించబడుతాయి.

## రోడ్డు రవాణా

1932 జూన్‌లో స్థాపించబడిన రోడ్డు రవాణా శాఖ ఆదాయాలు క్రమేణా పెరుగుతున్నవి. 1952-53 సం. లో ఈ శాఖకు వచ్చిన వెరసి ఆదాయం రూ. 262.80 లక్షలు రాగా 1954-55 సం. లో రూ. 273.28 లక్షలు ఆదాయం వచ్చింది. 1953-54 లో ఉండిన 5335 మైళ్ళ రూట్ మైలేజి 1954-55 లో 5747 మైళ్ళకు పెరిగింది. క్రొత్తగా అనేక సర్వీసులు తెరువబడినవి. కొన్ని విస్తృతపరచబడినవి. రోడ్డు రవాణా శాఖలకు మొత్తం 934 బస్సులున్నాయి. ఇవి వేళకు సరిగా నడుస్తున్నవి. 1954-55 సం. లో లైనుకు 97.3 శాతం ట్రిప్పులు నడిపించబడినవి. ట్రెయిన్ సర్వీసులలో గల 124115 నిర్ణీత సెక్షన్లలోను, 88393 బస్సు సర్వీసులలోను 99.9 శాతం సక్రమంగా నిర్వహింపబడినాయి.

ఈ శాఖకు 1954-55 సం. లో రూ. 48.90 లక్షల నికర ఆదాయం వచ్చింది. అంటే పెట్టుబడి మూలధనం పై రూ. 13.58 శాతం ఆదాయం వచ్చిందన్నమాట. అయితే అంతకుముందు సంవత్సరంలో 10.99 శాతం మాత్రమే వచ్చింది. 1955 మార్చి ఆఖరువరకు ప్రభుత్వం కేటాయించిన చెలామణి మూలధనంలో (అంటే రూ. 321.18 లక్షలు) 40 శాతం అంటే రూ. 14.20 లక్షలు

ప్రభుత్వానికి జమ కట్టబడినవి. అంతేగాకుండా రాష్ట్ర సాధారణ ఆదాయానికి పూరాక రూ. 26.00 లక్షలు మొత్తం జమకట్టబడినవి.

1955 ఏప్రిల్ నుంచి నవంబరు నెలాఖరు వరకు ఈ శాఖకు సుమారు రూ. 18,24,875 లు ఆదాయం వచ్చింది. ఈ కాలంలో సుమారు రూ. 1,59,660 లు ఖర్చు అయినవి.

రాష్ట్రంలో ఐదు ప్రాంతాలను ఏర్పాటు చేసి, ఒక ప్రత్యేక రవాణా అధికారుల కేడర్‌ను స్థాపిస్తూ, ప్రాంతీయ రవాణా శాఖను పునర్వ్యవస్థీకరించుటకు ఒక పథకం తయారుచేయబడింది. ప్రభుత్వం ఈ పథకాన్ని ఆమోదించింది.



■

# ఆర్థిక విషయాలు

ఇటీవలి సంవత్సరాలలో రాష్ట్రి ఆర్థిక విలీనీకరణ, కరోడ్గిరీరద్దు, హాలీకరెన్సీ ఉపసంహరణవల్ల కలిగిన ముఖ్య సమస్యలను ఆర్థికశాఖ ఎదుర్కోవలసి వచ్చింది. ఆరంభంలో హైదరాబాదుకు నిర్ణయించిన కేంద్ర ద్రవ్యసహాయం ఆశించినదానికంటే చాలా తక్కువగా ఉండింది. ఈ ద్రవ్యసహాయం రూ. 116 లక్షలు మాత్రమే లభించింది. హైదరాబాదు ప్రభుత్వం ఫైనాన్సు కమీషన్‌కు విన్నవించుకోగా కొంతమేలు కలిగింది. కేంద్ర హైదరాబాదు ప్రభుత్వాల సమష్టి ఆదాయంపన్ను, యూనియన్ ఆబ్కారీ పన్నులలోనుంచి హైదరాబాదువాటా కేంద్ర ద్రవ్యసహాయాన్ని మునుపటికన్న మూడింతలు చేయురేట్లలో నిర్ణయించబడింది. 1953-54 సంవత్సరంనుంచి ప్రాథమిక విద్యావ్యాప్తికై ప్రత్యేకగ్రాంటు మంజూరు చేయవలసి వచ్చింది.

కరోడ్గిరీశాఖ రద్దు చేయబడినప్పటికీ బకాయీ పనిని పూర్తిచేయుటకు ముఖ్యమయిన ఉద్యోగసిబ్బందిని ఉంచుకోవలసి వచ్చింది. 1956 సెప్టెంబరు ఆఖరువరకు ఈపనిపూర్తి కాగలదని ఆశింపబడుతున్నది. 1955 ఏప్రిల్ 1 నాడు రిట్రెంచిచేయబడిన కరోడ్గిరీ ఉద్యోగులలో 258 మంది పింఛను మీద రిటైర్ అయినారు; ప్రభుత్వ ఇతరశాఖలలో 1072 మంది తీసుకోబడినారు. ఇంకనూ 1437 మంది ఉద్యోగాలలోకి తీసుకోబడవలసి యున్నది. వారికి శీఘ్రంగా పునరావాసం కల్పించుటకు సాధ్యమయినంత కృషి చేయబడుతున్నది.

హైదరాబాదు రాష్ట్రంలో బ్యాంకింగ్ మరియు ఖజానా ఏర్పాట్లను ఇతర రాష్ట్రాలలో ఉన్న పద్ధతికి తీసుకొని వచ్చుటకు గ్రామీణ బ్యాంకింగ్ విచారణసంఘం చేసిన సిఫార్సుల ఫలితంగా ఇండియా రిజర్వు బ్యాంకు హైదరాబాదు ప్రభుతానికి బ్యాంకర్‌గా నియమించబడింది. హైదరాబాదు స్టేట్

బ్యాంకు 1953 ఏప్రిల్ 1 నుండి రాష్ట్రంలోపల ఇండియా రిజర్వుబ్యాంకుకు ఏజెంటుగా నియమింపబడింది, హైద్రాబాదు కరెన్సీ నిర్వహణకు ఆర్థికశాఖ భారతప్రభుత్వ ఏజెంటుగా పనిచేస్తున్నది.

క్రమేణా హాలీ కరెన్సీని చెలామణి నుంచి ఉపసంహరించేపని సాఫీగా కొనసాగుతున్నది. 1955 ఏప్రిల్ 1 వ తేదీన హాలీ కరెన్సీకి లీగల్ టెండర్ ప్రతిపత్తిపోయింది. అయితే ఇంకనూ హాలీ కరెన్సీ చెలామణిలో ఉండడంవల్ల ఈ కరెన్సీ ఉపసంహరణ కాలాన్ని 1956 సెప్టెంబరు ఆఖరువరకు పొడిగించుటకు కేంద్రప్రభుత్వం అంగీకరించింది. 1953 మార్చి 31 తేదీనాటికి చెలామణిలో ఉండిన రూ. 4,296.44 లక్షల విలువగల హాలీ కరెన్సీలోనుంచి రూ. 3858.14 లక్షల మేరకు కరెన్సీ చెలామణి ఉపసంహరించబడింది. ఇంకనూ చాలా విలువగల హాలీకరెన్సీ చెలామణిలో వున్నది. హాలీకరెన్సీని సంపూర్తిగా ఉపసంహరించుటకు మరొక సంవత్సరం అంటే 1957 మార్చి ఆఖరువరకు గడువు ఇవ్వవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని అభ్యర్థించడం జరిగింది.

మ. ఘ. వ. నిజాంనుంచి, పాతరైల్వే వాటాలనుంచి తీసుకొన్న ఋణములతోపాటు కలుపుకోగా ప్రభుత్వ ఋణాలు ఇప్పుడు రూ. 4,462.60 లక్షలున్నది. ఈ ఋణములలో కొంతభాగం, ఆర్థికవిలీనీకరణ ఏర్పాట్ల క్రింద భారతప్రభుత్వానికి మార్చబడవలసివున్నది.

భారతప్రభుత్వ సెక్యూరిటీలలో రాష్ట్ర ప్రభుత్వ పెట్టుబడులు, రాష్ట్రఋణములు, తదితరముల బాహ్యవిలువ (ఫేస్‌వ్యాల్యూ) రూ. 2,267.37 లక్షలువున్నవి. పారిశ్రామిక ధర్మకర్తృత్వనిధి కంపెనీలకు ఇచ్చిన అప్పులు మినహా స్థానికంగా బయటవున్న వాణిజ్యపారిశ్రామిక సంస్థలు వాటాలలో పెట్టుబడులు రూ. 508.41 లక్షలున్నవి.

యోగ్యతగల అకౌంట్స్ సిబ్బంది విషయంలో సామాజిక ప్రాజెక్టులు, జాతీయవికాస కేంద్రాల అవసరాలు తీర్చుటకై, పబ్లిక్ వర్క్స్ అకౌంట్స్‌లో అక్కౌంటెంట్లకు, సీనియర్ అక్కౌంట్స్ గుమస్తాలకు శిక్షణ ఇచ్చుటకు ఆర్థికశాఖ ఒక పథకమును ఏర్పాటుచేసింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద ప్రభుత్వశాఖలకు 150 మంది అకౌంటెంట్లు, 250 మంది సీనియర్ అక్కౌంట్సు

గుమస్తాలు అవసరమవుతారని అంచనావేయబడింది. అవసరమైన పరిస్థితి దృష్ట్యా 5 నెలల శిక్షణ కోర్సు ప్రవేశపెట్టబడింది. త్వరలో యెక్కువ తరగతులు తెరచి శిక్షణ సౌకర్యాలను యెక్కువచేయుటకు తలపెట్టబడింది.

ఆర్థికసంఘం సిఫార్సుల ననుసరించి, ఆర్థిక సలహాదారుడు మరియు స్టాటిస్టిక్స్ డైరెక్టర్‌యొక్క రెండు కార్యాలయాలను ఎకనామిక్స్ అండ్ స్టాటిస్టిక్స్ బ్యూరోలో కలుపబడినవి. ఈ బ్యూరో ఆర్థికశాఖ పర్యవేక్షణక్రింద పనిచేస్తున్నది.

అమ్మకంపన్ను శాఖలో అమ్మకంపన్ను న్యాయస్థానాన్ని ఏర్పాటుచేయుటకు ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది.

వ్యవసాయ ఆదాయంపన్ను మినహాయింపు పరిమితిని హాలీ రూ. 10000 ల నుంచి కల్దారు రూ. 5000 లకు తగ్గించుటకు ప్రభుత్వం ఆమోదించింది.

అమ్మకంపన్ను విధింపునుండి ఈ క్రింద పేర్కొనబడిన వాటిని మినహాయించుటకు మంజూరీ లభించింది. (1) ఒకటి లేక రెండు గానుగలుగల యజమానులు ఉత్పత్తిచేయునూనె. (2) 7-6-1955 నుంచి 18-10-56 వరకు వ్యవసాయ ప్రయోజనాలకొరకై వ్యవసాయశాఖద్వారా వ్యవసాయదారులకు విక్రయించబడు ఎలెక్ట్రిక్ పంపులు, పైప్‌లు, ఫిట్టింగులు. (3) రైతులకు విత్తనాలు నాటుటకు పంచిపెట్టుటకై వ్యవసాయశాఖ కొను ప్రత్తిగింజలు. హైదరాబాదు చేనేతవారి కేంద్రసహకారసంఘంనుంచి నూలుపై వసూలుచేయబడిన అమ్మకంపన్ను అంతా తిరిగీ గ్రాంటురూపంలో వాపసు చెల్లించబడింది.



# అభివృద్ధి సూచిక

| శాఖ | | 1952 లో | 1955 లో |
|---|---|---|---|
| **ఆంతరంగిక వ్యవహారాలు** | | | |
| పోలీసు వ్యయం | .... | రూ. 4,72,21,000 (రాష్ట్ర ఆదాయాలలో 15.2 శాతం) | రూ. 3,04,74,000 (రాష్ట్ర ఆదాయాలలో 9.9 శాతం) |
| **వైద్యం, ప్రజారోగ్యం** | | | |
| ఆసుపత్రుల సంఖ్య | .... | 214 | 227 |
| మంచములు | .... | 4,022 (4500 జనాభాకు ఒక మంచం) | 5,696 (3000 జనాభాకు ఒక మంచం) |
| **స్థానిక పరిపాలన** | | | |
| గ్రామ పంచాయతీలు | .... | 1,012 | 1,224 |
| సిటీ ఇంప్రూవ్‌మెంటు బోర్డు యొక్క నిర్మాణ కృషి | .... | ఆజమాబాదులో 300 ఇండ్లు | 112 ఇండ్ల నిర్మాణం పూర్తి అయింది. తక్కువ ఆదాయం గల వారికి 500 ఇండ్లు నిర్మింపబడుతున్నవి. పారిశ్రామికగృహవసతి పథకం క్రింద 1194 ఇండ్లు. |
| **వాణిజ్యం, పరిశ్రమలు** | | | |
| బొగ్గు ఉత్పత్తి | .... | 14,34,194 టన్నులు | 15,96,632 టన్నులు (ప్రథమప్రణాళిక లక్ష్యాన్ని మించి ఉత్పత్తి జరిగింది) |
| సిమెంటు | .... | 1,38,720 టన్నులు | 3,41,346 టన్నులు |
| కాగితం | .... | 1,13,788 హండ్రడ్‌వైట్లు | 2,68,028 హండ్రడ్‌వైట్లు |
| చక్కెర | .... | 5,16,220 హండ్రడ్‌వైట్లు | 9,60,826 హండ్రడ్‌వైట్లు |
| నూలు వస్త్రములు | .... | 7,68,48,227 పౌనులు | 8,84,77,000 పౌనులు |
| అభివృద్ధి పథకములు | .... | ఏకీకరించబడిన గ్రామీణ పరిశ్రమల అభివృద్ధిపథకం | 27 చేనేత అభివృద్ధి పథకములు 20 సహకార కార్య కేంద్రాలు, అగ్గిపెట్టెల కుటీర పరిశ్రమ పథకములు. కుటీర, గ్రామీణ పరిశ్రమల స్టాట్యూటరీ బోర్డు. పరిశ్రమలకు ప్రభుత్వ సహాయపు ఆర్డినెన్సు |

| శాఖ | 1952 లో | 1955 లో |
|---|---|---|
| **వ్యవసాయం** | | |
| వరిపైరు క్రింద భూమి ... | 12,77,384 ఎకరాలు | 15,72,152 ఎకరాలు |
| వరి ఉత్పత్తి .... | 3,25,631 టన్నులు | 4,81,874 టన్నులు |
| ప్రత్తిపంటక్రింద భూమి.... | 28,56,423 ఎకరాలు | 30,35,843 ఎకరాలు |
| ప్రత్తి ఉత్పత్తి .... | 1,75,722 టన్నులు | 2,26,754 టన్నులు |
| సేద్యంక్రింద వున్న మొత్తం భూమి .... | 277.6 లక్షల ఎకరాలు | 301.6 లక్షల ఎకరాలు |
| కంపోస్టుఎరువుఉత్పత్తి ... | 3,20,939 టన్నులు | 3,93,073 టన్నులు |
| **ఎరువుల పంపిణీ** | | |
| వరిపైరు ఎరువు .... | 46 టన్నులు | 12,000 టన్నులు |
| అమోనియం సల్ఫేట్ ... | 1.2 టన్నులు | 6,000 టన్నులు |
| సూపర్ ఫాస్ఫేట్ .... | 2.3 టన్నులు | 300 టన్నులు |
| పచ్చిఎరువు విత్తనాలు .... | 102 మణుగులు | 3,000 మణుగులు |
| **మార్కెటింగు** | | |
| క్రమబద్ధం చేయబడిన మార్కెట్ల సంఖ్య .... | 70 | 83 |
| మొత్తం వసూళ్ళు .... | రూ. 15,78,282 | రూ. 17,85,181 |
| **సహకారం** | | |
| సహకార సం॥ సంఖ్య.... | 12,775 | 14,638 |
| **రెవిన్యూ** | | |
| **భూ సంస్కరణలు** | | |
| రక్షిత కౌలుదార్ల సంఖ్య.... | 6,10,363 | 6,20,000 |
| రక్షిత కౌలుదార్లు కొన్న భూమి .... | 54,263 ఎకరాలు | 1,41,000 ఎకరాలు |
| | రక్షిత కౌలుదార్లందరికీ కౌల్దారీ సర్టిఫికెట్లు జారీ చేసే పని పూర్తిఅయింది. | కౌల్దారీ చట్టంలోని 38-ఇ సెక్షన్ నిర్ణీత ప్రాంతాలలో అమలు జరుపబడుతున్నది. గరిష్ఠ పరిమితులు అమలులోకి తేబడుతున్నవి. భూముల లెక్కల పని పూర్తి అయింది. హక్కుల రికార్డులు తయారు చేయబడుతున్నవి. 23,194 మంది వ్యక్తులకు షిక్మీదారీ సర్టిఫికెట్లు పంచిపెట్ట బడినవి. |

| శాఖ | 1952 లో | 1955 లో |
|---|---|---|
| **పశువైద్యం** | | |
| స్థావరంగాఉండేసంస్థలు.... | 28 | 30 |
| సంచారక వ్యవస్థలు .... | 23 | 182 |
| **సామాజికాభివృద్ధి** | | |
| కమ్యూనిటీ ప్రాజెక్టులు .... | 2 | 17 |
| డెవలప్‌మెంటు బ్లాకులు.... | 1 | 17 జాతీయ వికాస కేంద్రాలు |
| **విద్య :** | | |
| ప్రాథమిక పాఠశాలల సంఖ్య .... | 10,617 | 12,975 |
| విద్యార్థుల సంఖ్య .... | 2,16,825 | 8,50,000 |
| బేసిక్‌స్కూళ్ళ సంఖ్య .... | 34 | 100 |
| సెకండరీ పాఠశాలల సంఖ్య .... | 386 | 967 |
| వయోజన పాఠశాలల సంఖ్య .... | 517 | 1,400 (సాంఘికవిద్యా కేంద్రాలు) |
| విద్యార్థుల సంఖ్య .... | 28,646 | 60,000 |
| సాంకేతిక విద్య - అన్ని సంస్థలలో శిక్షణపొందే అభ్యర్థుల సంఖ్య .... | 2,416 | 4,016 |
| **పబ్లికు వర్క్సు** | | |
| పూర్తిచేయబడిన రోడ్లు.... | 471 మైళ్ళు | జాతీయ రహదార్లలో 26 రోడ్డుల పనులు ప్రారంభింపబడినవి. సుమారు 200 మైళ్ళ పొడవున 18 రోడ్లలో పని జరుగుతున్నది. |
| మరమ్మతు చేయబడిన చెరువులు, కాలువలు .... | 1,004 | 1,099 |
| **విద్యుచ్ఛక్తి** | | |
| హైద్రాబాదు నగరంలో వినిమయదార్ల సంఖ్య .... | 19,886 | 32,951 |
| ఉత్పత్తి - యూనిట్లలో .... | 5,20,52,645 | 6,04,00,000 |

★